# పాలస్తీనా

రచయిత:

నార్ల వెంకటేశ్వరరావు

నవయుగ ప్రచురణాలయం
పెదపసనగల్లు (పోస్టు)
కృష్ణాజిల్లా.

నా స్త్ర వారి

ఇతర గ్రంథాలు

*

నేటిరష్యా

రష్యన్ కథలు

స్వదేశ సంస్థానాలు

ఆస్ట్రియా ఆక్రమణ

జెక్ రాజ్యవిచ్ఛేదం

*
* *

శ్రీ సూరపనేని వెంకటరత్నము

శ్రీ యార్లగడ్డ వెంకటకృష్ణారావు

ప్రియమిత్రులకు

*
* *

# 1

స్వాతంత్ర్య ప్రేమకూ, సామ్రాజ్య తత్వానికీ... జాతీయతకూ, జాత్యహంకారానికీ ... ధర్మానికీ, అధర్మానికీ — ప్రస్తుతం మూడు దేశాలలో బహిరంగసంఘర్షణ ... భయానక యుద్ధం...జరుగుతున్నది. ఆ మూడు దేశాలు ఇవి: చీనా, స్పెయిన్, పాలస్తీనా.

చీనామహారాజ్యాన్ని కబళించి, ఆసియాఖండంమీద ఆధిపత్యాన్ని సంపాయించాలని చూస్తున్నది — జపాను. ఈ దుర్ప్రయత్నాన్ని ప్రతిఘటించడానికి అఖండమైన త్యాగాన్ని చేస్తున్నారు,— చీనావారు.

స్పెయిన్ దేశాన్ని సామంత రాజ్యంగా చేసుకుని, మెడిట రేనియన్ ప్రాంతంలో అప్రతిహతంగా విలసిల్లాలని ఆశిస్తు న్నది,—ఇటాలియన్ ఫేసిస్టుప్రభుత్వం. "విజయమో వీరస్వర్గ మో" అనే మహాదీక్షతో స్వీయ స్వాతంత్ర్యరక్షణకోసం పోరాడుతున్నారు,— స్పెయిన్ ప్రజలు.

సరిగా ఇదేవిధంగా...ఇవేపరిస్థితులలో...పాలస్తీనా ఆరబ్బులు బ్రిటిష్ ఇంపీరియలిజంతో సంఘర్షిస్తున్నారు.

చీనాలో జపానువారు చూపుతున్న రాక్షసత్వానికిగాని, స్పెయిన్‌లో ఫేసిస్టులు ప్రదర్శిస్తున్న అమానుషత్వానికిగాని, పాలస్తీనాలో బ్రిటిష్ ఇంపీరియలిస్టులు అవలంబిస్తున్నవిధానం తీసిపోదు. అయితే, చీనా — స్పెయిన్ దేశాలలో జరుగుతున్న ఘోరకృత్యాల్నిగురించి మనకు వార్తలు వస్తూవుంటాయి. పాలస్తీనానుగురించి మాత్రం యథార్థమైనసంగతులు తెలియవు. ఇందుకు ముఖ్యకారణం,—మనకు విదేశవార్తల్ని పంపించే రాయిటర్ న్యూస్ఏజెన్సీ. ఈ సంస్థకు బ్రిటిష్ ప్రభుత్వంవారి ధనసహాయం వుంది. పైగా, దీనికి యూదు జాతివారిపట్ల అభిమానం హెచ్చు. అసలు దీనిసంస్థాపకుడే యూదుజాతివాడు. అందువల్ల బ్రిటిష్‌ప్రభుత్వానికి కళంకాన్ని తెచ్చే సంఘటనల్ని — పాలస్తీనా అరబ్బులకు అనుకూలమైన వార్తల్ని — ఈ సంస్థ కప్పిపుచ్చుతున్నది.

"అరబ్బు దుండగీళ్ళు ఈనాడు ఫలానాచోట అల్లరి చేశారు."

"అరబ్బు బందిపోటుదొంగలు నిన్నను ఫలానా బ్యాంకును దోచుకున్నారు."

"అరబ్బు హంతకులు నేటివుదయం ఫలానా బస్తీలో యూదుల్ని చిత్రవధచేశారు."

రాయిటర్ పాలస్తీనానుగురించి పంపించే వార్తల ధోరణి ఇదే! ఈ వార్తల్ని చదువుతూవుంటే మానవాధములైనవారు ఎవరో కొందరు దౌర్జన్యాలనుచేస్తూ, ప్రజల ప్రాణ

మానవిత్తాల్ని హరిస్తూవున్నట్లు తోస్తుంది; ధర్మయుతమైన ప్రభుత్వంమీాద పితూరీచేస్తున్నట్లు కనపడుతుంది. కాని, న్యాయానికి పాలస్తీనాలో జరుగుతున్నది పితూరీకాదు; స్వాతంత్ర్య సమరం. దానిలో పాల్గొంటున్నవారు దుండగీళ్ళుగాని, బందిపోటుదొంగలుగాని, హంతకులుగాని కాదు; జాతీయాభిమాన పూరితులైన వీరశేఖరులు.

ఈ విషయాన్ని బ్రిటిష్ కలోనియల్ మంత్రి మాల్కాం మాక్డొనాల్డ్ కూడా ఇటీవల అంగీకరించక తప్పిందికాదు. కామన్సు సభలో 1938 నవంబర్ 24వ తేదీనాడు పాలస్తీనా సమస్యను గురించి ఉపన్యసిస్తూ ఇతను "పాలస్తీనా అరబ్ ఉద్యమంలో పాల్గొంటున్నవారిలో చాలామంది దేశాభిమాన ప్రేరితులైన వారని చెప్పక తప్పదు. వారి దేశాభిమానం వక్రమార్గాల్ని పట్టిన పట్టివుండవచ్చునుగాని, అసలు వారి దేశాభిమానాన్ని మాత్రం శంకించడానికి వీలులేదు." అని అన్నాడు. ఇక పాలస్తీనా అరబ్బులు చేస్తున్నది స్వాతంత్ర్యసమరం కాదని ఎవరనగలరు?

అన్నట్లు, కొందరు పాలస్తీనాలో అరబ్బులకూ యూదులకూ జరుగుతున్న సంఘర్షణనుబట్టి పాలస్తీనా సమస్య కేవలం "అరబ్బు - యూదు" సమస్య అని భావించడం కద్దు. భారత దేశ సమస్య కేవలం "హిందూ - మహమ్మదీయ" సమస్య అని భ్రమించడం ఎలా వుంటుందో, ఇదికూడా సరిగా అంతే!


నల్ల సముద్రం
టర్కీ
సిరియా
జర్మన్ యుద్ధంలో
టర్కీ పోగొట్టుకొన్న
సామ్రాజ్యము
అంగుళం : 250 మైళ్లు

## 2

పాలస్తీనా చాల చిన్న దేశం. దాని వైశాల్యం షుమారు 200 చదరపు మైళ్ళు మాత్రమే! కాని దానికి ప్రాచీన చరిత్రలోనేమి, ప్రస్తుతకాలంలోనేమి విశేష ప్రాముఖ్యత వున్నది. ఇందుకు మొదటి కారణం,—దాని ఉనికి.

పాలస్తీనా మూడు ఖండాలకు — ఆసియా, ఆఫ్రికా, యూరప్ ఖండాలకు — మధ్యస్థంలో వున్నది. అంచేత ప్రపంచపు రహదార్లకు అది పెద్ద జంక్షన్ అయింది. పూర్వకాలంలో ప్రపంచం ఎగుమతి దిగుమతులు పాలస్తీనా పడమటి దిక్కులో వున్న రహదారిపైగానే నడుస్తూవుండేవి. వర్తక వ్యాపారాలకు మాత్రమే కాకుండా, ఆనాటి జైత్రయాత్రలకు కూడా ఆ మార్గమే ఉపకరించేది. అస్సీరియన్, పర్షియన్, బాబిలోనియన్, యూరపియన్ సైన్యాలు ఈజిప్టుపై దండెత్తి వెళ్లిందీ, ఈజిప్టు నాటిని తరిమి కొట్టిందీ ఆ మార్గం వెంటనే.

పాలస్తీనా తూర్పుదిక్కులో కూడా ఇలాంటి రహదారే వుండేది. ఇది దక్షిణాన గాజా దగ్గర బయల్దేరి, జోర్డాన్ ఎడారికి తూర్పుగా సిరియాలోకి వెళ్ళి, అక్కడినుంచి మెసపొటోమియా అస్సీరియా, ఆర్మీనియా, ఆసియామైనర్ మొదలైన ప్రాంతాలను చేరుకునేది. ఈజిప్టునుంచి అరేబియాకు వెళ్లే రోడ్డుకూడా గాజామీదుగానే పోయేది.

ప్రాచీనకాలంలో పాలస్తీనా ఇన్ని రోడ్లకు జంక్షన్ అయితే, ప్రస్తుతం ఇది అంతకు మించిన వైమానిక మార్గా

లకు జంక్షన్. యూరప్, ఆఫ్రికా, ఆసియా ఖండాలమధ్య ప్రయాణంచేసే విమానాలు ఇక్కడనే మజిలీ చేస్తున్నాయి.

ఇక, పాలస్తీనా ప్రాధాన్యానికి రెండో కారణం, — దానిలో వున్న పుణ్యక్షేత్రాలు. యూదీయులకు, క్రైస్తవు లకు, మహమ్మదీయులకు — వీరందరికీకూడా అది పవిత్ర భూమి.

యూదుజాతికీ, దాని మతానికీ, దాని విజ్ఞానానికీ పాల స్తీనా జన్మస్థానం. హిందువులకు వారణాసివలెనే, యూదీయు లకు జెరుసులం అతి పవిత్రక్షేత్రం. వారి మతంలోనూ, వారి చరిత్రలోనూ ప్రసిద్ధికెక్కిన హెరాడ్ దేవాలయం ఈ నగరం లోనే వుండేది. ఇప్పుడు ఆ దేవాలయం అంతటికీ మిగిలింది ఒకజీర్ణకుడ్యం*. దీన్ని "వెయిలింగ్ వాల్" అంటారు. పర్వ దినాలలో యూదీయులు ఇక్కడచేరి ప్రార్థనలు చేస్తూవుంటారు. "శిథిలమైపోయిన మా రాజ్మందిరం కోసం మేము ఏకాం తంగా కూర్చుని విలపిస్తున్నాము; వినాశనం చేయబడ్డ మా దేవమందిరంకోసం మేము ఏకాంతంగా కూర్చుని విలపిస్తు న్నాము; విలిప్తమైన మా ప్రతిభకోసం, గతించిన మా మహా పురుషులకోసం, భస్మీపటలమైన మా భాగ్యరాసులకోసం మేము ఏకాంతంగాకూర్చుని విలపిస్తున్నాము" — ఇదే వారి ప్రార్థనల సారాంశం. ఈవిధంగా వారు అక్కడ విలపిస్తూ

---

*మొండిగోడ

వుంటారుగనుకనే ఆ జీర్ణకుడ్యానికి "వెయిలింగ్ వాల్" (విలాపకుడ్యం) అనే పేరు వచ్చింది.

"వెయిలింగ్ వాల్" మాత్రమే కాకుండా "జియాన్" పర్వతంకూడా జెరుసలం నగరంలోనే వున్నది. ఈ పర్వతం కూడా యూదీయుల దృష్టిలో చాలా పవిత్రమైంది.

ఇక, క్రైస్తవులకు పాలస్తీనాలో ప్రతి అంగుళం కూడా పూజనీయమైనట్టిదే. వారి మతసంస్థాపకుడైన ఏసుక్రీస్తుపుట్టిందీ, పెరిగిందీ. తనసందేశాన్ని చాటిందీ, చివరికి సిలువమీద ఆత్మార్పణంచేసిందీ పాలస్తీనాలోనే. ఆయన జీవితంతో సంబంధం వున్న ప్రతిప్రదేశమూ క్రైస్తవులకు ఒక మహాపుణ్యక్షేత్రం. వీటిలో జెరుసులం నగరానిది అగ్రస్థానం.

పోతే, మహమ్మదీయుల దృష్టిలోకూడా జెరుసులం పెద్ద పుణ్యక్షేత్రమే! మక్కా, మదీనాలతర్వాత జెరుసులంకు వీరు ప్రాధాన్యతను ఇస్తారు.

ఉనికినిబట్టీ, వివిధమతాలతోవున్న సంబంధాన్నిబట్టీ పాలస్తీనాకు ఏర్పడ్డ ఈ అధికప్రాముఖ్యతవల్లనే ప్రాచీనకాలం నుంచీకూడా అది అనేక సంఘర్షణలకు...అనేక యుద్ధాలకు... కేంద్రమైంది.

ఈజిప్షియనులు, పర్షియనులు, యవనులు, అరబ్బులు, టర్కులు మొదలైనవారు అనేకులు వివిధసమయాలలో పాలస్తీనాపైకి దండెత్తివెళ్ళారు; దాన్ని జయించి పరిపాలించారు. ప్రస్తుతసమస్యను తెలుసుకోడానికి ఈ ప్రాచీనచరిత్ర అనవ

సరం. కాని, రెండు మూడు ముఖ్యమైన తేదీలను మాత్రం గుర్తుంచుకోవలసి వుంటుంది. అవి ఇవి :

క్రీస్తుశకం 70 వ సంవత్సరంలో జెరుసలమును ధ్వంసం చెయ్యడం, అక్కడనుంచి యూదుజాతివారిని వెళ్ళగొట్టడం జరిగింది.

1516 లో టర్కీ పాలస్తీనాను జయించుకుంది. అప్పటి నుంచి 1917 వరకు పాలస్తీనా టర్కీ పరిపాలనలోనే వుంది.

# 3

టర్కీ నిరంకుశ పరిపాలనక్రింద పాలస్తీనాతోపాటు తక్కిన అరేబియా అంతాకూడా అతి హైన్యస్థితిని అనుభవించవలసి వచ్చింది. దాన్ని భరించలేక అరబ్బుజాతి నాయకులు విప్లవ ప్రయత్నాలు ప్రారంభించారు. ఈ ప్రయత్నాలు 1910 తర్వాతగాని ఒకరూపానికి రాలేదు.

1911 లోనో, 12 లోనో మెసపటోమియాకు స్వాతంత్ర్యాన్ని సంపాయించాలని బాగ్దాడ్‌లోని ఇరాక్ సైనికోద్యోగులు ఒక రహస్య సంఘాన్ని స్థాపించారు. సిరియా స్వాతంత్ర్యంకోసం డమాస్కస్‌లో ఇంకొక రహస్యసంఘం ఏర్పడింది. మక్కా గ్రాండ్ షెరీఫ్ అయిన హుస్సేన్ — ఇతడు మహమ్మద్ ప్రవక్త వంశీయుడు — అరేబియానంతటినీ తన అధిపత్యంక్రింద స్వతంత్రరాజ్యంగా చెయ్యాలని కలలుకనసాగాడు

నెజ్ద్ ఎడారులలో ఇబిన్ సాద్ తలయెత్తి, వాహబీ స్వాతంత్ర్యోద్యమానికి నాయకుడయ్యాడు. మొత్తంమీద అరబ్బుజాతి అంతాకూడా టర్కీ దాస్యశృంఖలాలనుంచి తప్పించుకోవాలని తహతహలాడసాగింది.

సరిగా ఈసమయంలో ఐరోపామహాసంగ్రామం (1914) ప్రారంభమైంది. ఈమహాసంగ్రామంలో టర్కీ జర్మనీపక్షాన్ని వహించింది. ఇది అరబ్బులకు చక్కని అవకాశంగాకనబడింది.

బ్రిటన్, ఫ్రాన్సు మొదలైన మిత్రమండలి రాజ్యాల పక్షాన చేరి, వాటి సహాయంతో విప్లవాన్ని ప్రకటించి, టర్కీ దాస్యాన్ని వదుల్చుకుంటే, స్వరాజ్యాన్ని సంపాయించుకుంటే, ఈ ఆశ, ఈ కల అరబ్ జాతినంతటినీ ఆయుధధారణకు పురికొల్పింది.

అరబ్బుల దాస్యబాధను—వారి స్వరాజ్యాకాంక్షను—స్వప్రయోజనానికి వినియోగించుకోవాలని మిత్రమండలి రాజ్యాలవారు మొదటినుంచీ అనుకుంటూనేవున్నారు. అరబ్బులందరిచేత తిరుగుబాటు చేయిస్తే, అది టర్కీసామ్రాజ్యంవెన్నుని పొడిచినట్టవుతుంది. ఇంతటి సదవకాశాన్ని చేయిజారిపోనివ్వడమే!

టర్కీ సూయజ్ కాల్వకు సమీపంలోవున్న రాజ్యం. అది ఆకాల్వమీద దండెత్తితే, దాన్ని జయిస్తే, బ్రిటన్-ఫ్రాన్సుల ఆట కట్టినట్టే! * అంచేత ఎంత త్వరగా టర్కీని దెబ్బకొడితే, అంత మేలు.

* 1914—1916 సంవత్సరాలమధ్య టర్కీసేనలు రెండుసార్లు సూయజ్ కాల్వమీద దండెత్తినాయి

ఈఆలోచనతో బ్రిటిషువారు ఈజిప్టులో తమ హైకమిషనర్‌గా వుంటున్న సర్ హెన్రీ మాక్-మాహోన్‌ను అరబ్బు జాతీయ నాయకులతో రహస్యరాయబారాల్ని సాగించవలసిందిగా ఆజ్ఞాపించారు. ఈ ఆజ్ఞప్రకారం అతడు మక్కా-లోని షరీఫ్ హుస్సేన్‌తో ఉత్తరప్రత్యుత్తరాల్ని నడిపాడు.

“ఏడెన్‌ను మినహాయించి మిగిలిన అరేబియా అంతా కూడా స్వతంత్రరాజ్యంగా ఏర్పడ్డానికి మిత్రమండలివారు అంగీకరిస్తే మేము మీపక్షానచేరి విప్లవం కొనసాగిస్తాము” అని సర్ హెన్రీ ఉత్తరానికి హుస్సేన్ ప్రత్యుత్తరాన్ని వ్రాశాడు. దానికి ఒప్పుదలకాకుండా సర్ హెన్రీ బేరానికి దిగాడు. కొన్ని రోజులపాటు ఈ బేరం సాగిన తర్వాత బసరా — బాగ్దాడ్ ప్రాంతం బ్రిటిష్‌వారి అధికారంక్రిందనూ, అలెప్పొ బైరూత్ జిల్లాలు ఫ్రెంచివారి అధికారంక్రిందనూ తాత్కాలికంగా వుండవచ్చునని హుస్సేన్ అంగీకరించాడు. ఆ తర్వాత 1915 అక్టోబర్ 24 వ తేదిని బ్రిటిష్ ప్రభుత్వంవారితరఫున సర్ హెన్రీ “మక్కా షెరీఫ్ సూచించిన సరిహద్దులలోని అరబ్ రాజ్యాల స్వాతంత్ర్యాన్ని అంగీకరించడానికీ, దాన్ని (ఆస్వాతంత్ర్యాన్ని) స్థాపించడంలో తోడ్పడ్డానికీ వాగ్దానంచేస్తున్నాము,” అని తెలియబరిచాడు.

అరబ్బుల సహాయం అవసరంకావడంవల్ల, బ్రిటిష్‌వారు అరేబియానూ — దానిలో ఒకభాగమైన పాలస్తీనానూ — ఈవిధంగా అరబ్బుజాతివారికి వాగ్దానం చేశారు. కాని, అరబ్బుల

సహాయం అవసరమైనట్టే, వారికి యూదీయుల తోడ్పాటు కూడా కావలసివచ్చింది. అంచేత వారు అరబ్బులకు ఇచ్చివేస్తా మన్న పాలస్తీనానే యూదీయులకుకూడా వాగ్దత్తం చేశారు.

# 4

స్వదేశభ్రష్టులైన యూదీయులు పశ్చిమాభిముఖులై యూరప్ లోని వివిధదేశాలకు వలసవెళ్ళి, అక్కడ నివాసమేర్పరచు కున్నారు. కాని ఒకచోటనైనా వారికి శాంతి, భద్రతలు చిక్క లేదు. అన్యజాతీయులు, అన్యదేశస్థులు, అన్యమతంవారు అనేక కారణాలచేత ప్రతి చోటనూ వారిని అనుమానంగా చూడ్డమే!

"ఏసుక్రీస్తును సిలువ వేసినవారు" అని యూదీయు లకు ఒక కళంకం వుంది. దీన్ని సాకుచేసుకుని, ప్రతిదేశంలోనూ క్రైస్తవ మతగురువులు వారిమీద ప్రజావిద్వేషాన్ని రగు ల్చేవారు. ఇంతేకాదు. యూదీయుల ప్రజ్ఞావిశేషాలే వారికి ఒక లోపంగా పరిణమించాయని కూడా చెప్పవచ్చు. తమ అపారమేధాశక్తివల్ల వారు ఏభాషనైనా సులభంగా అభ్యసించగలరు; ఏవృత్తిలోనైనా తేలికగా చాకచక్యాన్ని సంపాయించగలరు. అంచేత ఎంతటి హైన్యస్థితిలో—ఎంతటి పరదేశానికి వెళ్ళినా—వారు ఇట్టే పైకిరాగలరు. ఇది స్థానిక ప్రజల అసూయను రేకెత్తించడం సహజం.

ఈ అన్ని కారణాలవల్ల ప్రతి దేశంలోనూ యూదీయుల్ని హింసించడం, ప్రతిచోటనుంచీ వారిని తరిమికొట్టడం సంభవించింది; సంభవిస్తున్నది.

ఇంగ్లండునుంచి వారిని 1290 లోనూ, ఫ్రాన్సునుంచి 1394 లోనూ, స్పెయిన్‌నుంచి 1492 లోనూ, పోర్చుగల్ నుంచి 1497 లోనూ, నేపుల్సునుంచి 1540 లోనూ, వియన్నా నుంచి 1670 లోనూ, బొహీమియానుంచి 1745 లోనూ తరిమి వేశారు. యూరప్ పశ్చిమభాగంలోని ఒక్కొక్క దేశంలో నుంచి ఇలా తరిమి వెయ్యగా, యూదీయులు యూరప్ తూర్పు దిక్కుకు (రష్యా, పోలెండు మొదలైన తూర్పు దేశాలకు) చేరుకున్నారు. కాని, కొంతకాలమైన తర్వాత ఇక్కడినుంచి కూడా వారికి ఉద్వాసం చెప్పారు.

తమకు ఒక దేశం — ఒక జాతీయ కేంద్రం — లేక పోవడం వల్లనే అందరి తాపుల్ని పడుతూ, ఎక్కడనూ నిలువ నీడలేక అల్లాడ వలసిన గతి పట్టిందిగదా అని యూదు జాతి వారికి సంతాపం కలిగింది. అయితే, ఎంత సంతాపంలో వున్న ప్పటికీ ఏదో అస్పష్టమైన ఆశారేఖ వారికి కొంత కొత్తబలాన్నీ ఉత్సాహాన్నీ ఇస్తూవుండేది. ఆ అస్పష్టమైన ఆశారేఖ, — పాలస్తీనా!

పాలస్తీనా తమ మాతృదేశం; తమ పుణ్యభూమి; తమ జాతీయకేంద్రం; తమ విజ్ఞానవాటిక. ఏనాటికో ఒకనాటికి ఏదో ఒకవిధంగా అది తిరిగి తమది కాకపోతుందా? తిరిగి

అక్కడ తాము సుఖంగా, స్వేచ్ఛగా శాంతంగా జీవించగల భాగ్యం పట్టకపోతుందా? క్రైస్తవుల ఘోరహింసకు బలి అయిన ప్రతియూదీయుని హృదయాంతరాళంలోనూ అస్పష్టంగావున్న ఈ ఆశారేఖకు ఒక స్వరూపాన్ని కల్పించి, దాన్ని ఒక మహోద్యమంగా చేసినవాడు డాక్టర్ థియొడోర్ హెర్జల్.

డాక్టర్ హెర్జల్ ఆస్ట్రియాదేశస్థుడు. అతడినివాసం వియన్నా. వృత్తి జర్నలిజం; నాటకాలు వ్రాయడం. అతడు చాల అందమైనవాడు; అంచాన్నిమించిన ప్రతిభగలవాడు.

"డ్రేఫస్ కేసు" ను తనపత్రికకు రిపోర్టుచెయ్యడానికి 1894లో డాక్టర్ హెర్జల్ ప్యారిస్‌నగరానికి వెళ్ళాడు. ఈ కేసు చరిత్ర ప్రసిద్ధికెక్కినట్టిది. దీనిలో ముద్దాయి ఒక యూదుసైన్యాధ్యక్షుడు (జనరల్). పేరు,—డ్రేఫస్. ఫ్రెంచి సైనికరహస్యాల్ని ఏదో విదేశప్రభుత్వానికి అందజేశాడని అతడిమీద కేసువచ్చింది.

డ్రేఫస్ నిర్దోషి అని అందరికీ తెలుసు. అయితేమాత్ర మేమి? అతడు యూదుజాతివాడు. ఆజాతికి చెందడమే ఒక నేరం. ఇక ఆ జాతికి చెందివుండికూడా ఉన్నతసైనికోద్యోగి కావడం క్షమింపరాని పెద్దనేరం. అంచేత అతడిని శిక్షించవలసిందే! అతడు అనేక యుద్ధాలలో పాల్గొన్నమాట నిజం. ఎన్నో సైనికగౌరవాల్ని పొందినమాట నిజం. కాని, యూదుజాతివాడైనందువల్ల అతడి విషయంలో ఈ సంకోచాలు అనవసరం. తప్పక అతడిని శిక్షించవలసిందే! కఠినంగా శిక్షించ

వలసిందే! డ్రెఫస్‌కు కఠినశిక్ష పడింది. ముందు దేశద్రోహాన్ని చేసినందుకు అన్ని సైన్యాలముందు అవమానం ప్రదర్శనం. ఆ తర్వాత ఆజన్మద్వీపాంతరవాసం.

ఈ కేసులో స్వజాతీయుడైన డ్రెఫస్‌కు జరిగిన ఘోరాన్యాయాన్ని కళ్లార చూచినప్పుడు "అన్య దేశాలలో వుంటూ, ఆ దేశాలకు యూదీయులు ఎంత ప్రేమపూర్వకంగా సేవ చేసినప్పటికీ, వారు ఆ దేశస్థులలో ఐక్యమైపోలేరు. వారు ఐక్యమైపోవాలని అనుకున్నా ఆ దేశాలవారు అలా జరగనివ్వరు," అని హెర్జల్ నిశ్చయించుకున్నాడు. అయితే, మరి యూదీయులగతి ఏమిటి? ఆ క్షణంలో అతడి మనోవీథిని ఒక మెరుపు మెరిసింది — పాలస్తీనా!

యూదులు తిరిగి పాలస్తీనా చేరుకోవలసిందే! పాలస్తీనా చాలా చిన్న దేశం. అక్కడ ప్రపంచంలోని అందరు యూదులు స్థిరపడ్డానికి తగినంత ప్రదేశం లేదు. అంచేత అందరూ అక్కడికి చేరుకోవడం అనేది అసంభవం. కాకపోతే సంభవం కాగల కార్యం ఏమంటే, — పాలస్తీనా యూదీయులకు తిరిగి జాతీయ కేంద్రం కావడం. "జాతీయ కేంద్రం" అనే ఈ ఆశయాన్ని సాధించడానికే హెర్జల్ 1897 లో "జియోనిజం" అనే ఉద్యమాన్ని ప్రారంభించాడు.

హెర్జల్ ప్రారంభించిన ఈ ఉద్యమం అతడి ప్రతిభా విశేషం వల్లనేమి, రాజకీయ చతురతవల్లనేమి* సత్వరాభి

హెర్జల్ 1904 లో మరణించాడు.

వృద్ధినిచెంది, ఐరోపామహాసంగ్రామం నాటికి ప్రపంచవ్యాప్తిని గాంచింది.

# 5

యుద్ధం వ్యయంతోకూడినవ్యాపారం. ఈ వ్యయమైనా ఒక కోటీ, రెండుకోట్లూ కాదు; శతకోట్లు, సహస్రకోట్లు. ఇంత పెద్దమొత్తాన్ని కేవలం అదనపు శిస్తులవల్ల సంపాయించడం పడదు. అంచేత, ఋణాన్ని చేసితీరాలి. ప్రభుత్వాలకు పెద్ద పెద్దఋణాల్ని ఇవ్వగలవారు బ్యాంకర్లు. లండన్, ప్యారిస్, న్యూయార్క్:- ఈ నగరాలలోని పెద్దబ్యాంకర్లు చాలావరకు యూదుజాతివారు. అంచేత ఈ నగరాలలో తనకు తగిన పరపతి ఘట్టాలంటే, తాను "జియోనిజం" పట్ల అభిమానాన్ని చూపించాలని బ్రిటన్ అనుకుంది. ఈ ఆలోచనతో యుద్ధం ముగిసిన తర్వాత పాలస్తీనాను యూదీయులకు జాతీయ కేంద్రంగా చేస్తానని అది వాగ్దానం చేసింది.

బ్రిటన్ యూదులకు ఈవిధంగా వాగ్దానం చెయ్యడానికి ఇంకో కారణంకూడా వుంది. బాంబుల్ని చెయ్యడానికి "ఆల్కహాల్" చాలా అవుసరం. యుద్ధసమయంలో మామూలుగా వుండే చిక్కులవల్లనేమి, జర్మన్ సబ్ మెరీనులు ఓడల్ని ముంచివేస్తూవుండడంవల్లనేమి, బ్రిటన్కు "ఆల్కహాల్" తగినంతగా దొరకడం అసాధ్యమైపోయింది. ఈ కష్టసమయంలో డాక్టర్ చెయిమ్ వైజ్మన్ కేవలం దేవుడిలా అడ్డుపడ్డాడు.

డాక్టర్ వైజ్‌మన్ మాంచెస్టర్ యూనివర్సిటీలో కెమిస్ట్రీ (రసాయనశాస్త్రం) ప్రొఫెసర్. ఆయన పుట్టింది రష్యన్ పోలెండ్‌లో.* చదువుకున్నది జర్మనీలో. 1904 ప్రాంతాలలో ఇంగ్లండ్ వచ్చి, అక్కడనే నివాసం ఏర్పరచుకొన్నాడు. బ్రిటన్‌లోని "జియోనిస్టు" నాయకులలో అతడే అగ్రగణ్యుడు. "ఆల్కహాల్" తగినంతగా లభించక బ్రిటన్ ఇబ్బందిలో పడ్డప్పుడు డాక్టర్ వైజ్‌మన్ కొయ్యలోనుంచి దాన్ని (ఆల్కహాల్) తియ్యడానికి ఒక చక్కటి పద్ధతి కనిపెట్టాడు.

ఆపత్సమయంలో ఇంత మహోపకారాన్ని చేసినందుకు చాలా సంతోషించి, అప్పటిలో బ్రిటిష్ ప్రభుత్వంలో "మ్యూనిషన్సు" (మందుగుండు) మంత్రిగావున్న లాయడ్ జార్జి "మిమ్మల్ని సముచితరీతిగా గౌరవించాలని అనుకుంటున్నాము. మీరు ఏమి పారితోషికాన్ని కోరుకుంటారో కోరుకోవలసింది" అని డాక్టర్ వైజ్‌మన్‌నుఅడిగాడు. ఇందుకు అతడిచ్చిన జవాబు ఇది.

"నాకు కావలసిన పారితోషికం మా యూదుజాతి వారికి ఉపకారం చెయ్యడానికి అవకాశం మాత్రమే."

ఈ పరిస్థితిలో డాక్టర్ వైజ్‌మన్‌ను సంతోషపెట్టడానికికూడా పాలస్తీనాను యూదీయుల జాతీయకేంద్రంగా చేస్తామని మాటనివ్వవలసి వచ్చింది.

* అంటే, అప్పటిలో రష్యాపరిపాలన కిందవున్న పోలెండ్ రాజ్య భాగంలో.

# 6

ఇప్పటికి పాలస్తీనా విషయమై బ్రిటన్ రెండు వాగ్దానాల్ని చేసింది. ఒకటి: ఆ దేశాన్ని అరబ్బుల స్వతంత్ర రాజ్యంగా చేస్తాననడం. రెండు: దాన్నే యూదీయుల జాతీయ కేంద్రంగా చేస్తాననడం.

ఈ రెండు వాగ్దానాలు పరస్పర విరుద్ధమైనట్టివి. పాలస్తీనా, అరబ్బుల స్వతంత్ర రాజ్యమైతే, యూదీయుల జాతీయ కేంద్రం కాలేదు. ఇక, అది యూదీయులకు జాతీయ కేంద్రమే అయితే, అరబ్బులకు అక్కడ స్వాతంత్ర్యం వుండదు. ఒకదాన్ని నిలబెట్టుకోవాలంటే, రెండోదాన్ని తప్పక తోసివెయ్యవలసిన స్థితిలో ఈ రెండు వాగ్దానాల్ని చెయ్యడమే తగనిపని. కాని, బ్రిటన్ ఇంతకంటెకూడా ఘోరమైన పనిని ఇంకొకదాన్ని చేసింది. అదేమంటే, — అటు అరబ్బులకూ, ఇటు యూదులకూ కాకుండా పాలస్తీనాను తానే స్వాహా చెయ్యాలనుకోవడం!

టర్కీనుంచి తాము జయించుకోబోతున్న అరేబియా రాజ్యాల్ని, వీళ్ళకూ వాళ్ళకూ కట్టబెట్టడం దేనికనుకుని కాబోలు, బ్రిటన్, ఫ్రాన్సులు తమలోతాము ఒక రహస్యపు ఒడంబడికను చేసుకున్నవి. దీన్ని "సైక్స్ - పికాట్ ఒడంబడిక" అని అంటారు. ఇది జరిగింది 1916 మే నెలలో.

ఈ "సైక్ - పికాట్ ఒడంబడిక" లోని ముఖ్యమైన షరతులు ఇవి : మెసపటోమియా రాజ్యమూ, పాలస్తీనా

లోని రెండుఓడరేవులూ (హైఫా, ఎక్రీ) బ్రిటన్ అధీనం కావాలి. సిరియాకోస్తా ఫ్రాన్సుపరిపాలనకింద వుండాలి. డమస్కస్, అలెప్పో, మోసుల్ ప్రాంతాలు ఫ్రాన్సు (ప్రత్యక్షపాలన కింద కాదుగాని) పలుకుబడిలో వుండాలి. ఇక, పాలస్తీనా (పెద్దఓడరేవులు రెండూపోగా మిగిలినభాగం) బ్రిటన్, ఫ్రాన్సు, రష్యా రాజ్యాల నిర్ణయాన్ని అనుసరించి ఏర్పడే ప్రత్యేక ప్రభుత్వానికి లోబడివుండాలి.

తెరవెనక జరిగిన ఈ కపటనాటకం (సైక్స్ - పికాట్ ఒడంబడిక) సంగతి యూదీయులకు తెలిసిందో, లేదోగాని, అరబ్బులకుమాత్రం తెలియనేలేదు. బ్రిటను తన వాగ్దానాన్ని చెల్లించుకుంటుందనీ, తమకు స్వాతంత్ర్యం లభిస్తుందనీ, ఆశ పడుతూ, వారు విప్లవాన్ని సాగించారు. టర్కీవారు స్వమతస్థులు. మహమ్మదీయులకు స్వమతస్థులంటే ఎంతపక్షపాతమో అందరికీ తెలిసిన విషయమే! అయితే, ఇక్కడ స్వమతస్థుల పక్షం వహించడమంటే, తమ దాస్యశృంఖలాల్ని తామే మరింత బిగించుకోవడమన్నమాట! ఇక, అన్యమతస్థులైన బ్రిటిష్ వారితో చేరితే, స్వాతంత్ర్యం లభిస్తుంది. స్వమతస్థుల పట్ల పక్షపాతమా? లేక, స్వాతంత్ర్యం పట్ల పక్షపాతమా? అరబ్బుల స్వాతంత్ర్యకాంక్షే నెగ్గింది; వారు టర్కీమీద తిరగబడ్డారు.

అరబ్బుల తిరుగుబాటును అణచివెయ్యడానికి టర్కీ మదీనాకు సేనల్ని పంపించింది. ఈ సేనలు మక్కాలోని పుణ్యస్థలాలమీద ఫిరంగుల్ని కాల్చాయి. టర్కీచేసిన ఈ తెలివి

తక్కునపనివల్ల, అరబ్ జాతివారిలో పరిపూర్ణమైన సంఘీభావం ఏర్పడింది. హుస్సేన్ మూడోకుమారుడైన ఫైజల్ నాయకత్వంక్రింద — ఇంగ్లీషు యువకుడైన టి. ఇ. లారెన్సు తోడ్పాటుతో — వారు హెజాజ్ గుండా దండెత్తివెళ్ళి, సినాయ్ గల్ఫ్ వరకు ఆక్రమించుకున్నారు.

ఇంతలోపుగా బ్రిటిష్ సేనాని అలెంబీ ప్రభువు ఈజిప్టునుంచి పాలస్తీనాపైకి దండయాత్ర ప్రారంభించాడు. ముందు పాలస్తీనాను ఆక్రమించుకుని, ఆ తర్వాత సిరియాగుండా టర్కీపైకి దండెత్తాలని అతడి ఉద్దేశం. అలెంబీ పాలస్తీనాను జయించుకుపోతూవుంటే, మదీనాలోవున్న టర్కీ సైన్యాలు అతడిని ఎదుర్కొనకుండా అరబ్బులు (ఫైజల్ అనుచరులు) కాపాడారు. మదీనానుంచి టర్కీ దళాలు రైలులో (పిలిగ్రిమ్స్ రైల్వే) వస్తూవుంటే, అరబ్బులు ఆ రైలుపట్టాల్ని మందుగుండుతో పేల్చివేస్తూవుండేవారు. తమ కుడిపక్కనుంచి టర్కీవారు ఎదుర్కొంటారనే భయం ఈవిధంగా తొలిగిపోగా, అలెంబీ అతి సులభంగా పాలస్తీనాలోని వివిధప్రాంతాల్ని జయించుకుంటూ, జెరుసలెం సమీపించాడు.

ఈ సమయానికి "సైక్స్-పికాట్" ఒడంబడిక జరిగినట్టు అరబ్బులకు చూచాయగా తెలిసింది. అయితే, వారు దాన్ని నమ్మలేదు. "సర్ హెన్రీ మాక్-మోహన్ ద్వారా మనకు స్వాతంత్ర్యాన్ని వాగ్దానంచేసిన బ్రిటన్ ఇంతద్రోహాన్ని చెయ్యడం అసంభవం" అని వారు అనుకున్నారు. "అలెంబీ విజయానికి మనంచేసిన అపారసేవను చూచినతర్వాతకూడా

బ్రిటన్ కృతఘ్నత చూపుతుందా!" అని వారు మనస్సును సమాధానపరుచుకున్నారు. బ్రిటన్ వాగ్దానంమీదా, దాని ధర్మబుద్ధిమీద ఇంత విశ్వాసాన్ని పెట్టుకున్న అరబ్బులమీద సోవియట్ ప్రభుత్వం చేసిన ప్రకటన పిడుగులా పడింది.

రష్యాలో 1917 నవంబర్‌లో బోల్షివిక్ విప్లవం జరిగి సోవియట్ ప్రభుత్వం ఏర్పడగానే, ఆ ప్రభుత్వంవారు "రష్యా ఇక ఐరోపా మహాసంగ్రామంలో పాల్గొనదు," అని ప్రకటించారు. ఇంతటితో ఆగక, మిత్రమండలి రాజ్యాల కపటాన్ని బయటపెట్టడానికి వారు యుద్ధసమయంలోనూ, అంతకు పూర్వమూ పరస్పరంగా చేసుకున్న రహస్యపు ఒడంబడికలన్ని కూడా లోకానికి వెల్లడిచేశారు. వీటిలో ఒకటి,—"సైక్స్-పికాట్ ఒడంబడిక".

అప్పుడు ఆరబ్బులకు బ్రిటన్ వాగ్దానాల మీదనూ, ధర్మబుద్ధిమీదనూ పోయిన విశ్వాసం తిరిగి ఎన్నడూ ఏర్పడలేదు; ఇక ఏర్పడదుకూడా!

# 7

బ్రిటన్, చేసిన వాగ్దానాల్ని చెల్లించకపోవటం ఒక పాలస్తీనాలోనే కాదు, ఇండియాలో, ఈజిప్టులో, ఇంకా ఎన్నో ఇతరచోట్ల అది ఈలాగే చేసింది. అయితే, పాలస్తీనాలో చేసినంత ఘోరంగా అది ఈ పనిని ఇతరచోట్ల చెయ్యలేదేమో!

పాలస్తీనాను అరబ్బు స్వతంత్రి రాజ్యంగా చేస్తానని ముందు మాటఇచ్చి, ఆతర్వాత దాన్ని తానే వశపరుచుకోవ డానికి బ్రిటన్ ఒకసాకు చెబుతుంది. అది ఏమంటే, — సర్ హెన్రీ మాక్ — మాహోన్‌కు హుస్సేన్ సూచించిన అరబ్బు స్వతంత్రిరాజ్యం సరిహద్దులలో పాలస్తీనా లేదట. ఇది కేవలం అబద్ధమనే చెప్పాలి. అరేబియా అంతటిలో సారవంత మైన ప్రిదేశాలలో ఒకటైన పాలస్తీనాను — తూర్పు మెడి టరేనియన్‌కు ఆయువుపట్టులలో ఒకటని చెప్పదగిన హైఫా ఓడరేవు వున్న పాలస్తీనాను—మూడు ఖండాల రహదార్లకు జంక్షన్‌గా వుండి, అరేబియా అంతటికీ ప్రాముఖ్యతను తెచ్చే పాలస్తీనాను — హుస్సేన్ తాను సూచించిన సరిహద్దులలో చేర్చలేదనడం నమ్మదగిన విషయం కాదు.

ఒకవేళ ఈ వాదాన్ని కొట్టివేసినా, ఇంతకంటె బలీయ మైన ప్రిత్యక్ష సాక్ష్యం వుంది. అరబ్బుల్ని విప్లవం చెయ్యవల సిందిగా ప్రిబోధిస్తూ బ్రిటిష్‌విమానాలు లక్షలాది కరపత్రాల్ని వెదజల్లాయి. ఈకరపత్రాలలో అరేబియాను స్వతంత్ర రాజ్యంగా చేస్తామని బ్రిటిష్‌వారు చెప్పారు. ఆ స్వతంత్రిరాజ్యానికి వారు స్వయంగా పేర్కొన్న సరిహద్దులలో పాలస్తీనా ఇమిడివుంది.

అంచేత, పాలస్తీనావిషయంలో బ్రిటన్ అరబ్బులపట్ల నమ్మకద్రోహం చేసినదనడంలో ఏమీ సందేహం అవసరం లేదు. ఈ విషయాన్ని ఒక బ్రిటిష్ ప్రిముఖుడే కిందివిధంగా అంగీకరించాడు:

"ఈ ప్రాంతంలో మనమార్గం ఉల్లంఘించిన వాగ్దానంతో నిండివుంది ... 1915 లో మనం పాలస్తీనాను హెజాజ్ రాజైన హుస్సేన్‌కు ఇస్తామన్నాము; 1916 లో సైక్స్-పికాట్ ఒడంబడికకింద దాన్ని మనమే అట్టిపెట్టుకోవాలనుకున్నాము; 1917 లో బాల్ఫర్ ప్రకటనద్వారా యూదులకిస్తామని వాగ్దానంచేశాము; 1918 లో తిరిగి హుస్సేన్‌కు దాన్ని ఆశపెట్టాము; యుద్ధవిరామం జరిగిన రోజులలో స్థానిక ప్రభువులకు పట్టం కడతామన్నాము; సంధిసభ (పారిస్ కాన్ఫరెన్సు) జరిగిన తర్వాత యూదీయులవైపు మొగ్గాము*.

పాలస్తీనా విషయంలో బ్రిటన్ ఇంత పట్టుదలగా దానిని అంటిపెట్టుకోడానికి—ఇంతకు ముందు సందర్భానుసారంగా అక్కడక్కడ సూచించినట్టు — అనేక బలీయమైన కారణాలున్నాయి. అవి ఏమంటే,—

సూయజ్ కాల్వ రక్షణకు ఈజిప్టుపై పెత్తనం ఎంతో అవసరమో, పాలస్తీనాపై ఆధిపత్యం కూడా అంతే అవసరం.

తూర్పు మెడిటరేనియన్‌లో బ్రిటిష్ నావికాశక్తి అకుంఠితంగా వుండాలంటే, హైఫాను గుప్పిటిలో పెట్టుకోవాలి.

బ్రిటన్‌కు కావలసిన పెట్రోలు విశేషంగా ఇరాక్‌లోని మోసుల్ నుంచి వస్తుంది. మోసుల్ గనులలోనుంచి తీసిన పెట్రోలును ఎగుమతికోసం మెడిటరేనియన్ సముద్రతీరానికి చేర్చడానికి సిరియా ఎడారులగుండా హైఫావరకు గొట్టాల్ని

(పైప్ లైన్) వేశారు. పాలస్తీనామీద ఆధిపత్యం లేకపోతే ఇరాక్ పెట్రోల్ సప్లయివిషయంలో చిక్కులు ఏర్పడుతాయి.

బ్రిటన్ నుంచి ఆసియాకూ, ఆఫ్రికాకూ వెళ్లే విమానాలకు కావలసిన వైమానికాశ్రయాల్ని కట్టుకోడానికి పాలస్తీనా చక్కగా ఉపకరిస్తుంది.

ఈవిధంగా బ్రిటిష్‌సామ్రాజ్యరక్షణకు పాలస్తీనా ఎంతైనా అవసరం. ఈవిషయాన్ని స్పష్టంగా అంగీకరిస్తూ ఇటీవలనే (1936 జూన్) యామెరీ అనే ఆయన కామన్సుసభలో ఇలా ఉపన్యసించాడు:

"అది (పాలస్తీనా) ఈ దేశానికీ, ఆఫ్రికాకూ, ఆసియాకూ మధ్యవున్న వైమానికమార్గాలకు క్లాప్‌హామ్ జంక్షన్. మెడిటరేనియన్‌లో ఏర్పడ్డ కొత్త పరిస్థితుల్ని బట్టి (ఇది ఇటలీ విజృంభణను మనస్సులో పెట్టుకుని అన్నమాట) సూయజ్ కాల్వ రక్షణవిషయంలో దానిప్రాముఖ్యత అపారం. మాండేట్ షరతులప్రకారం పాలస్తీనాలో మనం యుద్ధనౌకాశ్రయాల్ని నిర్మించుకోడానికి వీలులేనిమాట నిజం. కాని, మెడిటరేనియన్‌లోని పెద్ద ఓడరేవులలో ఒకదానిగాగాని, పారిశ్రామిక కేంద్రాలలో ఒకదానిగాగాని హైఫాను వృద్ధిపరిస్తే, యుద్ధసమయాలలో ఇతరచోట్లనుంచి మనం తెప్పించుకోలేని వస్తువుల్ని సప్లయ్ చెయ్యడానికి అది ఎంతైనా ఉపకరిస్తుంది."

# 8

ప్రాలస్తీనాను యూదు జాతీయకేంద్రంగా చేస్తానని బ్రిటన్ రహస్యంగా వాగ్దానం చేసిందేగాని, బహిరంగ ప్రకటన చెయ్యలేదు. రహస్యంగా చేసిన వాగ్దానాన్ని కాపాడటం, [illegible] దానికైనా వీలుండదు. అందుచేత, బహిరంగ ప్రకటన చెయ్యవలసిందిగా బ్రిటిష్‌ప్రభుత్వాన్ని డాక్టర్ వైజ్‌మన్ వగైరా యూదునాయకులు వొత్తిడిచేస్తున్నారు. సరిగా ఈసమయంలో అమెరికాలోని యూదీయుల సదభిప్రాయాన్ని సంపాయించుకోవడం బ్రిటన్‌కు అవసరంగాకూడా కనబడింది. అందుచేత 1917 నవంబర్‌లో బ్రిటిష్‌ప్రభుత్వం తరఫున బాల్ఫర్ (విదేశాంగ మంత్రి) ఒకప్రకటన చేశాడు. ఆ ప్రకటనలోని ముఖ్యభాగం ఇది:

"పాలస్తీనాలో యూదీయులకు ఒక జాతీయకేంద్రాన్ని ఏర్పరచడానికి బ్రిటిష్‌ప్రభుత్వంవారు అనుకూలంగా వున్నారు. ఈ ఆశయసిద్ధికి వారు శక్తివంచన లేకుండా పాటుపడతారు. ఈసందర్భంలో పాలస్తీనాలో ప్రస్తుతం వున్న యూదేతర సంఘాల హక్కులకుగాని ఇతరదేశాలలో వున్న యూదుల హక్కులకుగాని భంగం కలిగించే కార్యాన్ని ఏదీ చెయ్యరు."

సైక్స్-పికాట్ ఒడంబడిక సంగతి తెలుసుకునే నిస్పృహ చెందివున్న అరబ్బులకు ఈ బాల్ఫర్ ప్రకటన మరెంత ఆశాభంగాన్నీ, అసహ్యభావాన్నీ కలిగించిందో వేరుగా చెప్పనక్కరలేదు.

1917 అంతం నాటికి పూర్తిగా హతాశులై వున్న అరబ్బులకు 1918 లో యుద్ధవిరామం జరిగిన నాటికి తిరిగి ఆశలుపెట్టుకోడానికి కొంత అవకాశం కలిగింది. యుద్ధంలో పాల్గొన్న వివిధరాజ్యాలమధ్య జరగవలసిన సంధికి ప్రాతిపదికగా అమెరికా అధ్యక్షుడు విల్సన్ పధ్నాలుగుసూత్రాల్ని ప్రతిపాదించాడు. వీటిలో మూడోసూత్రం ఇది:

"ఈ యుద్ధంతో సంబంధంవున్న ప్రతిదేశం భవిష్యత్తును, అక్కడి ప్రజల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని నిర్ణయించాలిగాని, విభిన్నరాజ్యాలు స్వలాభంకోసం చేసుకునే బేరసారంలో ఇది కేవల మొకభాగం అనే పద్ధతిని చెయ్యకూడదు."

ఈ సూత్రం ప్రత్యేకంగా సైక్స్ - పికాట్ ఒడంబడికను రద్దుపరచడానికే ప్రతిపాదించినట్టు అరబ్బులకు తోచింది. ఇక, పన్నెండోసూత్రం వారికి మరింత ఆశను పోసింది. ఆసూత్రం ఇది:

"ఇప్పుడు టర్కీపరిపాలన కిందవున్న వివిధజాతులవారికి పరిపూర్ణమైన రక్షణ నిస్తూ, ఇతరుల జోక్యమేమీలేకుండా స్వపరిపాలనను సాగించుకోడానికి అవకాశమివ్వాలి."

"బ్రిటన్ ద్రోహంచేసినా, విల్సన్ మన పక్షాన వున్నాడు; మన ఆశలు ఇక ఈడేరినట్టే! మనకు స్వాతంత్ర్యం లభించినట్టే!" అని అరబ్బులు మహదానందం చెందారుగాని, అచిరకాలంలోనే తిరిగి వారు హతాశులు కావలసివచ్చింది.

# 9

ముందు జర్మన్; ఆస్ట్రియన్ సామ్రాజ్యాల్ని తమలో తాము పంచుకున్న తర్వాత బ్రిటిష్ ఫ్రెంచి ప్రభుత్వాలవాళ్ళు టర్కీ-సామ్రాజ్యం వైపుకు దృష్టిని మరల్చాయి. "టర్కీ పరిపాలన క్రింద వున్న అరేబియా స్వతంత్రరాజ్యంగా ఏర్పడ్డానికి అంగీకరిస్తాను" అని 1915 లో (సర్ హెన్రీ) మెక్ - మహాన్ల ద్వారా) బ్రిటన్ వాగ్దానం చేసినమాట నిజం. ఆ వాగ్దానాన్ని బ్రిటన్, ఫ్రాన్సులు రెండూచేరి 1918 నవంబరు 30 వ తేదీ నాడు "రిపీట్" చేసిన మాటకూడా నిజం. అయితేనేమి! ఆపత్కాలంలో లక్షవాగ్దానాలు చేస్తాము. వాటికి కట్టుబడి వుండడం సామాన్య వ్యక్తులకు తగుతుందేమోగాని, సామ్రాజ్యనిర్మాతలకు తగునా? పైగా, ఆర్థికంగా నేమి, సైనికదృష్టి లోనేమి, చాలా ప్రయోజనకరంగా వుండే ఆ దేశాలను గుప్పిటిలోనుంచి వదిలి వెయ్యడమే? పాలస్తీనా, సిరియా, ఇరాక్; ఈ మూడూకూడా ఆసియాఖండం భాగ్యరాసుల్ని చేరడానికి మార్గాలుగా ఉపకరిస్తవి. సూయెజ్ లోనూ, పర్షియన్ గల్ఫ్ లోనూ, పెట్రోల్ గను లున్నాయి. అబ్బ! అరేబియాను — దాదాపు ఇండియాఅంతటి వైశాల్యంగలిగి వున్న అరేబియాను — చేయిజారిపోనివ్వరాదు.

అయితే, దీన్ని పంచుకోవడం విషయంలో బ్రిటన్, ఫ్రాన్సులకు కొంత వివాదంవచ్చింది. కొంతకాలం కీచులాడుకున్నతర్వాత 1920 ప్రారంభంనాటికి అవి ఒకరాజీకి వచ్చాయి.

ఈ రాజీప్రకారం ఇరాక్ బ్రిటన్‌కు దక్కింది. పోతే, సిరియాను—టారస్ పర్వతాలకూ, సినాయిఎడారికీ మధ్యవున్న ప్రదేశాన్ని—బ్రిటన్, - ఫ్రాన్సులు చెరికొంత తీసుకున్నాయి. దీనిలో దక్షిణభాగాన్ని — అంటే పాలస్తీనాను—బ్రిటన్ తీసుకుంది; ఉత్తరభాగాన్ని — ఈభాగానికి సిరియాఅనే పేరు ఖాయంచేశారు — ఫ్రాన్సు తీసుకుంది. అంటే, లెబనాన్ సముద్రతీరమూ, డమాస్కస్ రాష్ట్రమూ ఫ్రాన్సుకు దక్కింది. పాలస్తీనాకు తూర్పుగావున్న ఒక యెడారికోసంకూడా — దీనికి ట్రాన్స్‌జోర్డాన్ అని పేరుపెట్టారు — బ్రిటన్ పంతుకు వచ్చింది.

ఈ విధంగా అరేబియాలో మంచి మంచి భాగాల్ని తాము తీసుకున్న తర్వాత, మిగతాఎడారిని బ్రిటన్, ఫ్రాన్సులు హుస్సేనుకు కట్టబెట్టాయి. హెడ్‌జాజ్‌కు— మక్కా, మదీనా పుణ్యక్షేత్రాలు. దీనిలోనే వున్నాయి — అవి హుస్సేన్‌ను రాజుగా ప్రకటించాయి. ఇక, హుస్సేన్‌కుమారుల్ని సంతృప్తి పెట్టడానికి అవి చక్కటి ఒక యెత్తు వేశాయి. అది ఏమంటే, హుస్సేన్ జ్యేష్ఠపుత్రుడు (ఆలీ) తండ్రి తదనంతరం హెడ్‌జాజ్‌కు రాజు కావచ్చుననడం; అతడి రెండవకుమారుని (అబ్దుల్లా) బ్రిటిష్‌వారి అధీనంలో వుండే ఇరాక్‌కు రాజును చేస్తామనడం; అతడి మూడవకుమారుని (ఫైజల్) ఫ్రెంచివారి పరిపాలనలోవుండే డమాస్కస్‌కు — సిరియా తూర్పుభాగానికి — రాజుగా వుంచుతామనడం. అసలైన రాజ్యాధికారం మనచేతిలో వున్నప్పుడు ఇంకొకడిని రాజుఅనిచెప్పి దిష్టి

బొమ్మగా నిలబెట్టడంలో చాలా లాభంవుంది. అప్పుడు జరిగిన మేలు అంతా మనదీ, కీడుఅంతా ఆ సృష్టిబొమ్మదని అని చాటుతూవుండవచ్చును. హుస్సేన్ కుమారుల్ని రాజులుగా* చేస్తామనడంలో బ్రిటన్, ఫ్రాన్సులు చేసిన ఆలోచన ఇదే!

ఈవిధంగా అరేబియాను — తమ [illegible] భిన్నంగా — బ్రిటన్, ఫ్రాన్సులు తమలో తాము పంచివేసుకున్నా, లోకానికి మాత్రం అధర్మం చేసినట్లు కనబడకుండా వుండడానికి "మేండేటరీ విధానం" అని ఒకతంతు చేశారు. కొందరు ప్రజలకు స్వరక్షణకుగాని, స్వపరిపాలనకుగాని తగు శక్తి వుండదట. అట్టివారిని ఊరికే వదలివేస్తే నానా కష్టాలు పాలౌతారట. అంచేత వారికంటె ఎక్కువ శక్తి, ఎక్కువ ప్రజ్ఞ, ఎక్కువ అనుభవం వున్నవారు, వారి పరిపాలనా భారాన్ని స్వీకరించి, వారికి క్రమక్రమంగా స్వరక్షణాశక్తినీ, స్వపరిపాలనాదక్షతనూ కలిగించాలట. ఇలాచెయ్యడం ఆ ప్రజలకేకాకుండా, మానవజాతికీ, సభ్యతకూ, సేవచెయ్యడమట. "మేండేటరీ విధానం" అంటే ఇదే! ఈ విధానం పేరు చెప్పి బ్రిటన్, ఫ్రాన్సు రాజ్యాలు ఇరాక్, పాలస్తీనా, ట్రాన్సు జోర్డాన్, సిరియాలను కబళించాయి.

---

*చివరికి ఈ ఏర్పాటులలో ఏది నిలవలేదు. ఫైసాల్‌ను సిరియాకు రాజుగా ప్రకటించిన కొన్ని మాసాలకే ఫ్రెంచివారు ఫైజలును అక్కడనుంచి తరిమివేశారు. అంతట అతడు తనఅన్న అబ్దుల్లాకు బదులు ఇరాక్‌కు రాజు అయ్యాడు. వాహబీలనాయకుడైన ఇబిన్‌సాద్. హెజాజ్ మీద దండెత్తి వెళ్లి, హుస్సేన్‌నూ, అతడిజ్యేష్ఠపుత్రుడు అలీని తొలగించి ఆరాజ్యాన్ని స్వాధీనపరుచుకున్నాడు.

# 10

"యూదులకు జాతీయ కేంద్రాన్ని స్థాపించడం, అరబ్బుల జాతీయ కేంద్రాన్ని కాపాడ్డం, మొత్తం జనాభా అంతటికీ స్వపరిపాలనా విధానంలో శిక్షణ ఇవ్వడం"—ఈమూడు ఆశయాల్ని సాధిస్తామంటూ బ్రిటన్ పాలస్తీనాపై మేండేటరీ అధికారాన్ని స్వీకరించింది. కాని, అది ప్రారంభంనుంచీ కూడా యూదులపట్ల పక్షపాతాన్ని చూపసాగింది. "ప్రారంభంనుంచీ కూడా యూదులపట్ల పక్షపాతం" అని అనడానికి తిరుగులేని నిదర్శనం ఇది: అలెంబీప్రభువు జెరుసులంను జయించినతర్వాత, పాలస్తీనా పరిపాలనకు మిలిటరీ గవర్నమెంట్‌ను ఏర్పరిచారు. ఈ మిలిటరీ గవర్నమెంట్‌ను తప్పించి, సివిల్ గవర్నమెంట్‌ను ఏర్పాటు చెయ్యడానికి 1920 లో బ్రిటన్ పంపించిన మొట్టమొదటి హైకమిషనర్ యూదుజాతికి చెందిన సర్ హెర్బర్ట్ శామ్యూల్ !

ఒక వైపున బ్రిటన్ అభిమానం వుంది; ఇంకోవైపున అంతర్జాతీయ యూదీయ సంఘాల ధన సహాయం వుంది. ఇంకేమి కావాలి? యూదులు పాలస్తీనాకు విరివిగా వలస రాసాగారు. వచ్చి, వారు అరబ్బుల భూముల్ని కట్టుకున్నారు; ముఖ్యమైన ప్రభుత్వోద్యోగాల్ని సంపాయించుకున్నారు; ఎన్నదగిన పరిశ్రమల నన్నింటినీ వశపరుచుకున్నారు; పాలస్తీనా పరిపాలన టర్కీనుంచి తమకు సంక్రమించినట్టే చేసివేశారు.

దాదాపు పదిహేను సంవత్సరాలక్రితం ఐ.రా.స. సంఘానికి వెళ్ళిన అరబ్బు డెలిగేషన్ వారు తమస్థితిని ఈ విధంగా వర్ణించారు:

"హైకమిషనర్ యూదీయుడు; లీగల్ సెక్రెటరీ, ఇమ్మిగ్రేషన్ కంట్రోలర్, ఇండస్ట్రీస్ డైరెక్టర్, చివరికి, పోలీసు శాఖాధికారి — అందరూ యూదీయులే! ప్రభుత్వపు ప్రతిశాఖనూ యూదీయులే వశపరుచుకున్నారు.

"అరబ్బుల స్వాతంత్ర్యాన్ని అరికట్టడానికీ, వారి అభివృద్ధిని ఆటంకపరచడానికీ, శాసనాలను చేస్తున్నారు. పత్రికలకు స్వాతంత్ర్యం లేదు. దేశాభిమానులైన అరబ్బుల్ని వారు ప్రజాక్షేమానికి ముప్పు తెస్తున్నారనే నెపంతో అరెస్టు చేస్తున్నారు.

"పాలస్తీనాలోని భూములన్నీకూడా ప్రభుత్వంవారి ఆస్తులట. తరతరాలనుంచి అరబ్బుల హక్కుభుక్తాలలో వున్న భూముల్ని సయితం వశపరుచుకుని, ఇవి మీకే తిరిగి కావాలంటే మాపేర కౌలు వ్రాయవలసిందని ప్రభుత్వంవారు అంటున్నారు. ఇలా చెయ్యడంలోగల ఉద్దేశం ఇది. ముందు ఈ భూముల ఖామందులు ప్రభుత్వం వారని ఋజువుచెయ్యడం; ఆతర్వాత వాటిని నెమ్మదిగా యూదీయులకు అమ్మివెయ్యడం.

"జనాభాలో నూటికి ఒకరైనా హీబ్రూ (యూదీయులభాష) మాట్లాడరు. అయినప్పటికీ దాన్ని ఒక రాజభాషగా అంగీకరించారు."

"వెల్లువలా వలసవచ్చి పడుతున్న యూదీయులవల్ల, జనభారం పెరిగిపోతున్నది. వలసవచ్చిన యూదుకూలీల కారణంగా అరబ్బుకూలీలకూడు పడిపోతున్నది. అరబ్బుకూలీ చేసేపనిలో యూదుజాతికూలీ సగంపనినైనా చెయ్యలేడు. కాని, అతడికే ఎక్కువకూలి ముట్టచెబుతూ వున్నారు."

"గవర్నమెంట్ కంట్రాక్టుల్ని చాలావరకు యూదీయులకే (వారు అరబ్బులకంటె యెక్కువ మొత్తానికి టెండరు పెట్టినా) ఇస్తున్నారు."

దాదాపు పదిహేనుసంవత్సరాలనాడు అరబ్బు డెలిగేషన్ వారు చిత్రించిన ఈస్థితికీ, నేటిస్థితికీ, భేదం ఏమైనా వున్నదంటే, అది నాటిస్థితికంటె నేటిది మరింత ఘోరంగా వుండడమే! ఇందుకు నిదర్శనంగా జాఫాలోని అరబ్ లేబర్ ఫెడరేషన్‌కు కొంతకాలం కార్యదర్శిగావున్న జార్జ్ మన్సూర్ ఇటీవల ప్రకటించిన ఒక వ్యాసాన్ని ఉదహరించవచ్చును. ఆవ్యాసంలోని కొన్ని భాగాలు ఇవి:

"దేశం ఎంతజనాభాను భరించగలదు అనే విషయాన్ని గురించి విచారించవలసిందిగా ప్రభుత్వంవారు నియోగించిన సింప్సన్, ఫ్రెంచ మొదలైనవారేగాక, ఇదేశానికి జియోనిస్టు (యూదు) సంఘంవారు స్వయంగా నియమించిన కాంపబెల్ కూడా 1930లోనే యూదీయులు చిత్తంవచ్చినట్టు వలసరావడంవల్ల దేశానికి నష్టంకలిగిందని ప్రకటించారు. అయినప్పటికీ వారిశిఫార్సుల్ని ప్రభుత్వంవారు తోసివేశారు. ఇలాచెయ్య

డానికిగల కారణాలు ఏమిటో వారికే తెలియాలి. అరబ్బులు ఇంకా నిద్రావస్థలో వుండగానే, వలసవల్ల తమ సంఖ్యాన్ని మెజారిటీ సంఘంగా చేసుకుందామనే యత్నాన్ని యూదీయులు పెట్టిన వొత్తిడికి ప్రభుత్వంవారు తలవొగ్గారు కాబోలు!

"1920 - 1930 సంవత్సరాలమధ్య సగటున ఏటేట 10,000 మంది చొప్పున యూదీయులు పాలస్తీనాకు వలస వచ్చారు. ఇంతమంది వలసరావడమే తగదని చెప్పుతున్నప్పటికీ, 1933 - 1935 సంవత్సరాలమధ్య 136,000 మందికి పైగా యూదీయులు ప్రభుత్వంవారి అంగీకారంతో వలసవచ్చారు. వీరుగాక దాదాపు 40,0000 మంది రహస్యంగా దేశంలో ప్రవేశించారు. 1919లో 50,000 మాత్రమేవున్న యూదుల జనాభా 1935 నాటికి 4,20,000 వరకు ఎలా పెరిగిందో దీని వల్ల తెలుస్తుంది.

"గ్రామవాసులు చాలవరకు అరబ్బులు. పట్టణవాసులలో అధికసంఖ్యాకులు యూదుజాతివారు. అందుచేత పట్టణవాసులైన యూదీయులకు లాభకరంగా, పల్లెలమీద ఎక్కువ పన్నులు వేస్తున్నారు. 1930లో పట్టణవాసులదగ్గరనుంచి వసూలు చేసిన పన్నులు 1,31,00 పౌనులైతే, పల్లెలలోనుంచి రాబట్టింది 3,95,000 పౌనులు. ఈ సంవత్సరానికి ఆదాయానికి సంబంధించిన అంకెలు తెలియవుగాని, 1936 లో బస్తీలవాళ్ల ఆదాయం దాదాపు రెండుకోట్లపౌనులు. ఇక, పల్లెటూరివారి ఆదాయం అరవైలక్షల పౌనులుమాత్రమే! ఆదాయంపన్ను

వుంటే యూదీయులే దాన్ని అధికంగా చెల్లించవలసివుంటుంది గనుక, అది లేనే లేదు.

"పల్లెలలో పన్నులు ఎక్కువవేస్తే ఆరబ్బురైతులు దాన్ని చెల్లించుకోలేక, తమభూముల్ని యూదీయులకు అమ్మేస్తారుగదా అనే వుద్దేశంతో పాలస్తీనాలోని బ్రిటిష్‌ప్రభుత్వం మొదటినుంచీ ఆవిధానాన్నే అనుసరిస్తున్నది. ఇందుకు నిదర్శనం బ్రిటిష్‌వాడైన యన్. బార్బర్ 1936 జూలై నెలలో 'పాలస్టైన్‌పోస్టు' పత్రికలో వ్రాసిన వ్యాసంలోని ఈక్రింది వాక్యాలే: జెరూసలంసమీపంలో వున్న ఒకగ్రామంలోని భూమి శిస్తు ఎకరానికి మూడుషిల్లింగుల నాలుగుపెన్నీల దగ్గరినుంచి (షుమారు రెండున్నర రూపాయలు), అయిదుపౌనుల నాలుగు షిల్లింగులవరకు (షుమారు 78 రూపాయలు) పెరిగింది! కొన్ని కొన్ని భూములకు ఇది ఎకరానికి ఎనిమిది పౌనులవరకు కూడ (షుమారు 120 రూపాయలు) పెరిగింది!! ఈ పెరుగుదలలోని విపరీతాన్ని ఇంకా బాగా అర్థం చేసుకోవాలంటే, మరిరెండు విషయాల్ని గమనించాలి. అవి ఏమంటే,— గ్రామంలో ఎకరానికి రెండు పౌనులకు (30 రూపాయలకు) మించి ఆదాయం రాదు. ఆరబ్బురైతుకుటుంబానికి సగటున వచ్చే మొత్తము ఆదాయం — సింప్సన్ రిపోర్టుప్రకారం — 29 పౌనుల 9 షిల్లింగులు.

"ఈ పరిస్థితులలో ఆరబ్బులు తమభూముల్ని యూదులకు అమ్మివెయ్యడంలో ఆశ్చర్యం వున్నదా? ఆరబ్బురైతుల

దగ్గరినుంచి యూదీయులు దాదాపు 8,00,000 డునామ్ముల సేద్యయోగ్యమైన భూమిని కట్టుకున్నారు. ఈ భూమి ఖరీదు క్రింద 1918 - 1935 సంవత్సరాల మధ్య వారు చెల్లించిన 73,51,000 పౌనులవల్ల అరబ్బు రైతులు పొందిన పరిహారం దాదాపు శూన్యం ఎంచేతనంటే, — ఈ మొత్తంలో అధిక భాగాన్ని మధ్యవాళ్ళు బ్రోకర్లు, యూదేతర భూస్వాములు కాజేశారు.

"యూదీయుల పరిశ్రమల్ని ప్రోత్సహించడం, దానిద్వారా అరబ్బుల పరిశ్రమల్ని అణగద్రొక్కడం-ఇదే బ్రిటిషు నీతి. ఈ నీతికారణంగా అరబ్బుల పరిశ్రమకు మొత్తంమీద దెబ్బతగిలింది. ఇందుకు ఒక ఉదాహరణ (అరబ్బులచే నడిపిన) సబ్బుపరిశ్రమ. 1925 లో 2,54,087 పౌనుల విలువగల సబ్బు ఎగుమతి అయింది. 1935 నాటికి ఈ ఎగుమతులు 77,897 పౌనులకు దిగజారినాయి.

"ఇంతటితోనైనా ఆగక ప్రభుత్వంవారు తాము చేయించే అన్నిపనులలోనూ యూదు కాంట్రాక్టర్లపట్ల అభిమానాన్ని చూపుతున్నారు. 1935 లో వారు తమ కంట్రాక్టులలో 2,97,099 పౌనుల విలువగల కంట్రాక్టుల్ని యూదుజాతి వారికిచ్చారు. పోగా, మిగిలిన 2,55,367 పౌనుల విలువగల వాటిని యూదేతరులకు అందరికీ కలిపి ఇచ్చారు. యూదేతరుల కిచ్చిన 2,55,367 పౌనుల కంట్రాక్టులలో అధికభాగం బ్రిటిష్ కంపెనీలకూ, ఇంకా ఇతర విదేశపుకంపెనీలకూ దక్కినాయి. (మిచ్చెల్ అండ్ రోలిన్ అండ్ కంపెనీ లిమిటెడ్; మేజర్ కే

అండ్ కంపెనీ; ఎ. యల్. మూస్ అండ్ కంపెనీ మొదలైన సొసైటీలు).

"ఇక, స్టీ ల్వేలలోనూ, హార్బర్లలోనూ, కస్టమ్సు ఆఫీసులలోనూ, పోస్టు అండ్ టెలిగ్రాఫ్ ఆఫీసులలోనూ అరబ్బుల పనవుల్ని యూదీయులు ఆక్రమించుకోడాన్ని గురించి ప్రత్యేకంగా చెప్పనక్కర లేదు."

బ్రిటిష్‌వారు పాలస్తీనాలో చేసిన ధర్మపరిపాలన ఇదే!

# 11

యూదుజాతివారపట్ల బ్రిటన్ ఇంతపక్షపాతాన్ని వహించడానికి కారణం, — నిరాశ్రియంగావున్న ఆజాతివారికి ఒక ఆశ్రియాన్ని కల్పించుదామనే సద్చింత కాదు; కేవలం స్వార్థచింత. యూదీయులపట్ల బ్రిటన్‌కు నిజంగా సానుభూతివుంటే వారిని వలసపంపించడానికి కెనడా లేదా? ఆస్ట్రేలియా లేదా? దక్షిణాఫ్రికా లేదా? ఒక్క ఆస్ట్రేలియాలోనే ప్రపంచంలోని యూదుజాతివారందరు వలస వెళ్ళడానికి తగిన సదుపాయంగా వుండగా, ఇంతకుపూర్వమే జనసంకీర్ణంగావున్న పాలస్తీనాలోనే వారికి తావుచూపించాలనే పట్టుదల దేనికి?

పాలస్తీనాలో సగటున చదరపుమైలుకు 143 మంది చొప్పున ఇప్పటికే వున్నారు. 1918-1919 సంవత్సరాలమధ్య దాని జనసంఖ్య 6,80,000నుంచి, 14,15,000 వరకు హెచ్చింది.

ఆరబ్బులసంఖ్య నూటికి 77వంతులు పెరిగింది. కాగా, యూదీయుల సంఖ్య నూటికి 703వంతులు పెరిగింది! ఇకముందు యూదీయుల వలసను పూర్తిగా ఆపివేసినా, మరి కొలదిసంవత్సరాలకు ఇప్పటి జనాభాయే సంతానోత్పత్తివల్ల పదిలక్షలకు పెరుగుతుంది. అప్పుడు సగటున చదరపుమైలుకు షుమారు 200 మంది నివసించ వలసివస్తుంది. ఇంత సాంద్రతని పాలస్తీనా భరించలేదు. అది అసలే చిన్నదేశం. దాని భూవైశాల్యంలో మూడోవంతు మాత్రమే సేద్యయోగ్యమైంది. ఇక, పరిశ్రమసంపత్తికూడా విశేషంగా లేదు. అందుచేత అక్కడికి యూదుల్ని వలసకు పంపించడం —పైగా, మితంలేకుండా పంపించడం — తగనిపని.

ఈ తగనిపనికి బ్రిటన్ పూనుకోడానికి అనేక కారణాలున్నాయి. వాటిలో ముఖ్యమైనట్టివి ఇవి.

ఆరబ్బులకూ, బ్రిటిష్‌వారికీ మత విషయంలోనేమి, విజ్ఞాన విషయంలోనేమి, ఆచారవ్యవహారాల విషయంలోనేమి, రాజకీయాల విషయంలోనేమి — దేనిలోనూ విశేషమైనా ఐక్యత లేదు. అందుచేత, బ్రిటన్ ఈసారి ప్రధాన యుద్ధంలోకి దిగితే, పాలస్తీనా ఆరబ్బులు శత్రుపక్షాన వుంటారనే ఆశకు అవకాశంతక్కువ. తమ పరిసరాల్లోవున్న స్వమతస్థులతో — వీరు బ్రిటన్‌కు ప్రతికూలంగా యుద్ధరంగంలో నిలిచేపక్షాన — పాలస్తీనా ఆరబ్బులు ముప్పాతిక మూడు వీసాలు చేరవచ్చును. అందుచేత బ్రిటిష్‌సామ్రాజ్యరక్షణకు ప్రాణప్రదమైన పాలస్తీనాలోని ఆరబ్బుల్ని తొక్కిపట్టివుంచాలంటే, వారిపైన అవసరమైనప్పుడు ఉసిగొల్పడానికి ఏదైనా కొత్త

సంఘాన్ని సృష్టించాలి. యూదుజాతివారు ఈపనికి చాలా చక్కగా పనికివస్తారు.

అరబ్బులకు అంగబలంవుంటే, యూదులకు అర్థబలం వుంది. అంచేత వారు తేలికగా అక్కడ కాలూనగలరు. ఇందుకులోడు వారిభాష అరబిక్; వీరిది హీబ్రూ. వారి మతం ఇస్లాం; వీరిది జూడాయిజం. వారి ఆచారవ్యవహారాలు ప్రాచ్య ఖండానివి; వీరివి పాశ్చాత్యఖండానివి, అంచేత వీరుభయులూ ఏకంకావడంగాని బ్రిటన్ మీాద ఎదురు తిరగడంగాని కల్ల, మహమ్మదీయ ప్రపంచంమధ్య ఏకాకులమై వున్నామనే భయం కొద్దీ యూదీయులు శాశ్వతంగా బ్రిటన్ ప్రాపకం కోసం దేవులాడ వలసిందే!

విభిన్నమైన దృక్పథాలు, విరుద్ధమైన ఆశయాలు కలిగి వున్న రెండుజాతులవారు ఒకేదేశంలో వున్నప్పుడు వారిలో వారికి కలహాలు తప్పవు. ఈ అంతఃకలహాల గొడవలో దేశానికి స్వాతంత్ర్యం కావాలనే ఆందోళన తప్పుతుంది. పైగా, యూదులూ, అరబ్బులూ అనవరతం సంఘర్షిస్తూవుంటే వారుభయులమధ్య తగవుతీర్చడానికి మూడవపక్షం వుండాలనే సాకుతో బ్రిటన్ శాశ్వతంగా దేశపరిపాలనాధికారాన్ని తనచేతిలోనే పెట్టుకోవచ్చును.

పైనె మానికాశ్రియాల పరిసరప్రాంతంలో ఎప్పుడూ స్నేహపాత్రంగావుండే ప్రజ లుండడం అవసరం. అరబ్బులు— ఇంతకుముందు వివరించినట్టు — ఎల్లకాలం స్నేహంగా వుంటారని ఆశించడానికి వీలులేదు. అంచేత పాలస్తీనాలో

యూదుజాతి కేంద్రాలు ఏర్పడితే, నాటినుంచి బ్రిటిష్ సన్నిహితం కోచంగా తనకై నమ్మకమైన ఆశ్రయాల్ని నిర్మించుకోవచ్చును.

యూదులపెట్టుబడిద్వారా పాలస్తీనా వ్యవసాయికం గానూ, పారిశ్రామికంగానూ అభివృద్ధి చెందినట్లయితే అప్పుడక్కడ బ్రిటిష్ వ్యాపారానికి ఎక్కువ సదుపాయంగా వుంటుంది.

ఇలాంటి అనేక కారణాలవల్లనే బ్రిటన్ యూదీయుల పట్ల పక్షపాతాన్ని చూపించిందిగాని, వారిపై ప్రత్యేక ప్రేమతో కాదు. ఈ విషయాన్ని 'కెప్టెన్' గవర్నర్ జనరల్ [illegible] మూర్ స్పష్టంగా అంగీకరించాడు. ఆతని మాటలు ఇవి:

" ప్రాచ్య, పాశ్చాత్య ఖండాలమధ్యనున్న రాజమార్గ రక్షణకు పాలస్తీనా పెట్టనికోటవంటిది. సూయజ్ కాలువ ఏర్పడిన తర్వాత ఈ రాజమార్గ రక్షణవిషయమై మనము కొంత ఆందోళన చెందవలసివచ్చింది ... ఈ దృష్టితో చూస్తే, ఈ కారణాలవల్ల (పాలస్తీనాను యూదుజాతీయ కేంద్రంగా ఏర్పాటుచేయడంవల్ల) గ్రేట్ బ్రిటన్‌కు ప్రస్తుతసమయంలో ఎంత ప్రయోజనం కలుగుతుందో తెలుసుకోవచ్చును."

నిరాశ్రయులై అల్లాడుతూవున్న ఒక [illegible] ప్రజ లకు జాతీయకేంద్రాన్ని ఏర్పరచాలనే మానవతాశయంతో ప్రారంభమైన జియోనిజం చివరకు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల స్వార్థసముపార్జనకు సాధనమైంది. అందుచేతనే దాన్ని చూచి అసహ్యించుకోవలసివస్తున్నది.

# 12

బ్రిటన్ పక్షపాతాన్ని అవకాశంగా చూచుకుని యూదీయులు అరబ్బులకు చేసిన — చేస్తున్న — అన్యాయాలు ఇన్నన్ని కావు.

తాము వలసరావడం ప్రారంభించిన కొత్తలో భూములకు వారు పెద్దపెద్ద ధరల్ని పెట్టసాగారు. దీనికి ఆశపడి అరబ్బు భూస్వాములు తమ భూముల్ని చక చక అమ్మివెయ్య నారంభించారు. ఇందుమూలంగా అంతకుముందు ఆభూముల్ని కట్టుబడి చేసుకు బ్రతుకుతున్న చిన్నచిన్న రైతు కుటుంబాలకు— దాదాపు ఆరువేల కుటుంబాలకు — జీవనాధారం పడిపోయింది.

కట్టుబడిదారులు మట్టికొట్టుకుపోయినా, పెద్దఆసాములు మాత్రం యూదులరాకవల్ల తమ భూములకు ధర పెరిగిందని చంకలెగరవేశారు. అయితే, త్వరలోనే వారికి కనువిప్పు అయింది. దేశంలో కొంతస్థావరం చిక్కగానే యూదీయులు ఒక్కమాట అనుకుని, భూములధరల్ని చప్పగా పడగొట్టించారు. దానితో పెద్దఆసాములకు కూడా దుస్థితి పట్టింది.

రైతులకూడు పడగొట్టినట్టే యూదుజాతివారు కూలీలకడుపుకూడా కొట్టారు. చౌకగా దొరుకుతున్నారుగదా అని ముందురోజులలో వారు అరబ్బుకూలీలనే పనికి పిలిచారు. కాని, తమజాతివారు తగినంతమంది వలసకురాగానే ఎక్కువకూలీనైనా పెట్టి వారిచేతనే పనిచేయించుకోసాగారు.

అయితే, యూదులలో కొందరు చౌకగా వస్తున్నారు గదా అని ఆశపడి, అరబ్బుకూలీలను పిలవడం మానలేదు. అలాంటి సందర్భాలలో జియోనిస్టుసంఘాలవారు పికెటింగ్ చేయించారు. ఈ పికెటింగ్ అనేకచోట్ల సంఘర్షణలకుకూడా కారణమైంది.

ఇక, ప్రభుత్వోద్యోగాలలో, వర్తకవ్యాపారాలలో, ప్రతిముఖ్యస్థానాన్ని యూదీయులు ఆక్రమించి వేసుకోవడము!

దీన్ని అంతటిన్ని చూడగా, పాలస్తీనాలోనుంచి అరబ్బుల్ని తరిమివేసి, దేశాన్ని పూర్తిగా తామే భుక్తం చేసుకుందామా అని యూదీయులు కుట్రపన్నుతున్నట్లు కనబడింది. ఇది ఉత్తి భయం కాదు. పాలస్తీనా జియోనిస్టు కమిషన్ అధ్యక్షుడైన డాక్టర్ ఎడర్ ఈ విషయాన్ని తెగవేసి చెప్పాడు. అతడి మాటలివి.

"పాలస్తీనాలో ఒకే జాతీయ కేంద్రం వుండాలి. అది యూదుజాతీయకేంద్రం. యూదీయులు, అరబ్బులు సమాన భాగస్వాములనడానికి వీలులేదు. యూదీయులజనాభా పెరిగినంత హెచ్చుగానే వారిదే పైచెయ్యిగా వుండాలి"

నూంచిపొమ్మంటే దెయ్యమై పట్టుకున్నట్లున్నది —— చూంచిపొమ్మనకుండానే వచ్చిన——యూదీయుల ప్రవర్తన!

# 13

ఒకవైపున బ్రిటిష్‌వారు, ఇంకోవైపున బ్రిటిష్‌వారి అండతో యూదీయులు తమకు చేస్తున్న ఘోరాన్యాయాల్ని ప్రతిఘటించడానికి స్వదేశాభిమానపూరితులైన ఆరబ్బులు మొదటి నుంచీకూడా ఆందోళన చేస్తూనేవున్నారు. వారి ఈ ఆందోళన కారణంగా అనేకపర్యాయాలు సంఘర్షణలు జరిగాయి. వీటిలో మొట్టమొదటిది 1920 ఏప్రిల్ 4వ తేదీనీ, చిట్టచివరిది 1936 ఏప్రిల్ 19 వ తేదీనీ ప్రారంభమైనాయి. అన్నింటిలోనూ ఈ చిట్టచివరి సంఘర్షణే అతిభీకరమైంది. ఇది ఇంకా సాగుతూనే వుంది.

ఆరబ్బుల స్వాతంత్ర్యదృమజ్వాలల్ని రుధిరధారలతో చల్లార్చాలని ప్రస్తుతం పాలస్తీనాలో బ్రిటిషువారు ఎంతటి రాక్షసకృత్యాలనుచేస్తున్నారో చెప్పడానికి వీలులేదు. పంజాబ్‌లో జనరల్ డయ్యర్ ప్రదర్శించిన అమానుషత్వంగాని, ఐర్లండ్‌లో బ్లాక్ అండ్ ట్యాన్ సైనికదళం ప్రదర్శించిన పశుత్వంగాని, ప్రస్తుతం పాలస్తీనాలో బ్రిటిష్‌వారు అమలు జరుపుతున్న దమననీతిముందు చాలాసౌమ్యంగా కనబడతాయనడం అతిశయోక్తి కాదు —— ముమ్మాటికి !

ఇటీవలనే జవ్హారిలాల్ నెహ్రూపండితుడు పాలస్తీనాను గురించి ఒక వ్యాసాన్ని వ్రాస్తూ, దానిలో బ్రిటిష్ వారు చేస్తున్న ఘోరకృత్యాల్ని తెలిపే ఒక లేఖను ఉదహరించాడు. ఈ లేఖను పాలస్తీనాలోవున్న ఒక ఇంగ్లీషులాయర్ ఇంగ్లండ్

లోవున్న తన స్నేహితుడికి వ్రాశాడట. ఉత్తరాన్ని వ్రాసిన వ్యక్తీ, దాన్ని అందుకున్నవ్యక్తీ — ఇద్దరూ కూడా విద్యావేత్తలట; విశ్వాసనీయులట. ఆ లేఖలోని కొన్ని భాగాలు ఇవి:

"ఇక్కడి ప్రభుత్వాధికారులు టెర్రరిస్టు నీతినే పూర్తిగా అవలంబించడానికి నిశ్చయించుకున్నట్టున్నారు. వారు చూపిస్తున్న పశుత్వాన్ని గురించి బ్రిటిష్ సివిలియన్ ఎవ్వడూ కూడా అసహ్యభావంతో కంపించకుండా మాట్లాడ్డంగాని, వ్రాయడంగాని కష్టం.

"మోఫత్ హత్యానంతరం వారు (సైనికులు) జనిన్ అనే చిన్నపట్టణాన్ని డైనమెట్‌తో పేల్చివేశారు. ఈ సందర్భంలో 150 యిళ్ళు కూలిపోయినవని ప్రభుత్వ ప్రకటనలో వుంది. ఈ అంచనాను మించికూడా నష్టం జరిగివుండవచ్చు.

"పారిపోవడానికి ప్రయత్నిస్తున్నారని చెప్పి కొందరిని కాల్చి చంపివేశారు. హత్యానేరాన్ని గురించి కూపీతియ్యడానికి అవలంబించిన పద్ధతులలో కొన్ని వర్ణించనలవికానట్టివి.

"ఈ ఘోరాల్ని చేసింది నేరస్థుల్ని శిక్షించడానికి కాదు; ప్రజల్ని హడలెత్తించడానికి మాత్రమే!

"కేవలం ఇళ్ళను నాశనం చెయ్యడమే కాకుండా ప్రజల ఆస్తినికూడా అపహరించారు (రొక్కం, నగలు మొదలైనవి). చివరకి న్యూయార్క్ స్టాండర్డ్ ఆయిల్ కంపెనీ వారి ఇనపపెట్టిలోని ద్రవ్యాన్ని కూడా సంగ్రహించారు. ఈ చర్యను అమెరికన్ కాన్సల్ (రాయబారి) తీవ్రంగా గర్హించాడు.



పోలీసులు ఒక అరబ్బుగ్రామాన్ని డైనమైటుతో పేల్చివేసినప్పుడు,
అక్కడే ఇమాం గాయపడి మరణించాడు.

*Courtesy "Deccan Times"*

“ఇక్కడ జరుగుతున్న అన్నివిషయాల్నీ నీకు తెలియ జెప్పడం దుస్సాధ్యం. విస్మయవిషాదాల్ని కలిగించే సంఘట నలు ఎన్నో నాకు తెలుసు. మచ్చుకు ఒకదాన్ని మాత్రం చెబుతాను: విప్లవకారులు టెలిఫోన్ తీగల్ని తెగగొట్టి వేస్తున్నారు. వాటిని గవర్నమెంట్ నౌకర్లు ఎప్పటి కప్పుడు రిపెయిర్ చేస్తూవుండాలి. ఇలా చేసేవారిలో కొందరు అరబ్బులు. వారు తీగల్ని బాగుచేస్తూవుండగా విప్లవ కారులు చూడ్డం తటస్థిస్తే — స్వజాతీయులని దయతలచ కుండా—తప్పక కాల్చివేస్తారు. అయినా, ధైర్యంచెడక, వారు ఉద్యోగధర్మాన్ని నిర్వహిస్తున్నారు. ప్రాణాలకుకూడా తెగించి ఇలా ప్రభుత్వానికి సేవచేసి, సాయంత్రానికి కొంపను చేరుకో బోతే, ఒక్కొక్కప్పుడు ఆకొంపనుకాస్తా సోల్జర్లు కూలదోసి వెళ్ళడం తటస్థిస్తుంది. పడిపోయినగోడలమధ్య బిక్కుబిక్కు రు మంటూ కూర్చున్న పెళ్లాంబిడ్డల్ని చూచుకోగానే, వాళ్ళ మనస్సు ఎలా వుంటుందో వేరే చెప్పాలా? ఇలాంటి ఘోరా లకు బలి అవుతున్నవారే ప్రస్తుతం విప్లవ కారులలో చేరిపో తున్నారు. ఇంతకంటె ఆందోళనకరమైన విషయం ఏమంటే— క్రమక్రమంగా విప్లవకారుల ధైర్య సాహసాలు పెరుగుతున్నవి గాని, తరగడం లేదు.

“శనివారంనాడు, ఇక్కడ జాఫాలో, సోల్జర్లు కంట బడిన ప్రతివాడినీ, కాల్పాలనీ బుద్ధి పుడితేచాలు, కాల్చివేస్తు న్నారు. ఒక గవర్నమెంట్ సర్వేయర్ — చదువుకున్నవాడు; ఇంగ్లీషు మాట్లాడ్డం నేర్చినవాడు — తన పనులు చూచుకుని

ఇంటికి వస్తూవుంటే, అతడిని సమీపంలో కాల్చి చంపారు. ఇలాగే ఏడేళ్ళ పిల్లనుకూడా హత్య చేశారు.

"నాకు పత్రికను తెచ్చియిచ్చే చిన్న కుర్రవాడు — బలే చలాకీ అయినవాడు — ఇవ్వాళ వుదయం రాలేదు. ఏమైపోయాడు చెప్మా అని విచారిస్తే, కాల్చి చంపారని తెలి సింది.

"కొన్నిరోజులక్రితం నేను ఒక క్రైస్తవ మతగురువును కలుసు కోగా, తాను బీరాన్‌షైన్ పేటలో చూచిన దృశ్యాల్ని గురించి చెబుతూ, ప్రభుత్వాన్ని పూర్తిగా సమర్థించాడు. ఆ పేట్ర న్‌లోని ఒక డాక్టర్ తనపట్టణంలో పోలీసులూ, సోల్జర్లూ చేసిన దారుణ హత్యల్నిగురించి వాళ్ళు జరిపించిన కథల్ని చెప్పాడు. అక్కడవున్న అరబ్బు షాపుల్ని, హోటళ్ళనూ ఒక్కదాన్నికూడా విడవకుండా దోచుకున్నారట."

ఈ బ్రిటిష్‌లాయర్ లేఖలోని విషయాల్ని చూచి "అబ్బ! ఇంతకంటె ఘోరకృత్యాలు వుంటాయా?" అని కొందరు అనుకోవచ్చును. కాని, అలాంటి సందేహం అనవసరం లేదు. పాలస్తీనాలో బ్రిటిష్ అధికారులు ఇంతకంటెకూడా రాక్షసమైన చర్యల్నికూడా చేస్తున్నారు. ఇందుకు ఉదాహరణలు కావాలంటే, "డక్కన్ టైమ్స్" (మద్రాసు) ప్రకటించిన ఈ వృత్తాంతాల్ని చూడవచ్చును:

"నసిరా సమీపంలోవున్న కాఫ్రికామా గ్రామానికి 1937 డిసెంబర్ 3 వ తేదీ శుక్రవారం ఉదయం కొందరు



యూదుల రాక్షసత్వానికి బలిఅయిపోయిన అరబ్ బాలిక

*Courtesy "Deccan Times"*

మిలిటరీ ఆఫీసర్లు వెళ్ళారు. ఆ ఆఫీసర్లు గ్రామంలోని ముఖ్యుల్ని అందర్నీ ఇళ్ళలోనుంచి బైటికి రమ్మని, వారిపాగాల్ని తీయించి ఎర్రటి ఎండలో వరసగా నిలబెట్టించి, వీపులమీద రక్తం కారేలా రాళ్ళతో బాదారు. తర్వాత వాళ్ళ ఇళ్ళనుకూడా సోదా చూచారు.

"మరి కొంతమంది మిలిటరీ ఆఫీసర్లు ఆగ్రామంలోనే మగవాళ్ళనందరినీ పొలాలలోకి తోలారు; ఆడవాళ్ళనందరినీ మసీదులోకి చేర్చారు. ఆమీదట సోదా అనే వంకతో ఇళ్ళ మీదపడి దోచుకున్నారు. మగవాళ్ళ బట్టల్ని ఊడదీయించి, వారిమీద కాలుతూవున్న నూనెను, ఇసుకను పోశారు. ఇది మిలిటరీ ఆఫీసర్లకు చెడ్డసరదాగా కనబడినట్లున్నది. తర్వాత ఆదౌర్భాగ్యుల్ని చాలాదూరం నడిపించారు. నడవలేక పోయిన వారిని కొరడాలతో బాదారు.

"ఒక సవిటి గొర్రెలకాపరిని 'ఎవడురా' అని పలకరిస్తే, వాడు బదులు చెప్పాడుకాదు. వెంటనే వాణ్ణి కాల్చి చంపారు.

"సంహానా అనే గ్రామంలో ముఖ్యమైన వారినందరినీ చెరువుగట్టుమీదికి చేర్చి, మంచులా జిమ్ముమంటూవున్న నీళ్ళలోకి తోశారు. మిలిటరీవారు వెళ్ళిపోయిన తర్వాతగాని వాళ్ళను వొడ్డుకు చేర్చడానికి వీలుపడలేదు. ఆడవాళ్ళను రాళ్ళగంపల్ని మొయ్యమన్నారు. సరిగా మొయ్యలేకపోయిన వారిని రాళ్ళతో కొట్టారు.

"ఒకచోట ఆహారపదార్థాల్ని, వస్త్రభాండాల్ని దోచుకోవడమే కాకుండా, అక్కడి స్త్రీ పురుషులందరిని సైన్య మాలిసపనులకు లోనుచేశారు. ఈ గ్రామ [illegible] ముఖ్తారుని తాడుతో ఒక కారుకు కట్టి, హైస్కూలు దాకా ఈడ్చుకు వెళ్లారు.

"తాలిపార్‌లో 150 మందిని గ్రామస్థుల్ని [illegible] లేకుండా ప్రదక్షిణాలు చేయించారు. అలసిపోయి పడిపోయిన వారిని కొరడాలతో క్రూరంగా కొట్టారు. కొందరు పారిపోవాలని చూస్తే, వారిమీద తుపాకుల్ని కాల్చారు. ఒకడు గాయపడ్డాడు. ఇంకొకడు పరుగెత్తలేక పట్టుబడ్డాడు. అతడిని చావ చితకగొట్టారు."

"ఘూస్‌డాన్‌లో ఇళ్ళను సోదా చేశారు. 35 మందిని (నలుగురు స్త్రీలతో సహా) గాయపరిచారు.

"చాలామంది ఉలేమాలను అరెస్టుచేశారు. అరెస్టు సమయంలో వారిని చాలా అవమానపరిచారు. కొందరిని రోజుకు మూడుసార్లు పోలీసుస్టేషనులో హాజరు వేసిపొమ్మని ఆజ్ఞాపించారు.

"మూడుచోట్ల కొరానును చించి పారవేశారు.

"సర్వ కార్మికసమ్మె (జనరల్ స్ట్రయిక్) సమయంలో షేక్ అర్సలాన్ మసీదును డైనమైట్‌తో పడగొట్టివేశారు."

గుండెల్ని జలదరింపజేసే ఈ వృత్తాంతాల్ని ప్రకటిస్తూ, "డక్కన్ టైమ్స్" ఇలా వ్రాసింది. "పీటినన్నింటిని

ఖించిన ఘోరసంఘటనల్ని మేము ప్రకటించడంలేదు. కారణం సువిదితమే !"

## 14

బ్రిటిష్‌అధికారులతో పాటు యూదీయులుకూడా ఆరబ్బులపట్ల రాక్షసత్వాన్ని ప్రదర్శిస్తున్నారు. ఒక అరబ్బీవాని ఇంటిని కూలదోస్తే, ఒక యూదీయునికి ఇల్లుకట్టుకోడానికి చోటు దొరుకుతుంది. పదిమంది అరబ్బుల కాలుచేతుల్ని విరిస్తే, పది మంది యూదీయులకు కూలినాలి దొరుకుతుంది. వందమంది అరబ్బుల్ని చంపివేస్తే, వందమంది యూదీయులు వలసరావ డానికి వీలుకలుగుతుంది. అరబ్బుజాతి ఎంతఎక్కువగా నశిస్తే, దేశం అంతసులభంగా యూదుజాతి వశమౌతుంది. ఈసూత్రం మీద వారు నడుచుకుంటున్నారు. వారుచేస్తున్న ఘోరకృత్యాల్ని గురించి ఒక జర్మన్‌పత్రిక ఇలా వ్రాసింది:

"జ్జాబా అనే అరబ్ గ్రామంలో నలుగురు యూదీయులు చాలామంది అరబ్ స్త్రీలను మానభంగం చెయ్యబోయారు. రాళ్ళనూ, రప్పల్నీ పుచ్చుకుని ఆస్త్రీలందరు తమను రక్షించు కోబోగా, ఈ మానవాధములు వారిలో ఒకసాధ్విని తుపాకి తో కాల్చివేశారు.

"తమకు ఆయుధాలులేకపోయినా, అరబ్ గ్రామస్థులు —జరిగిన దారుణహత్యను చూచి భయపడిపోకుండా —

ఆరాక్షసుల్ని ఎదిరించారు. ఈ పలుగురిలో [illegible] తప్పించుకుపోయారు. మిగిలిన ఇద్దరు పట్టుబడ్డారు. వారిచేతి లోని తుపాకుల్ని లాక్కొని, వారిని అరబ్బులు [illegible] రాళ్ళతో కొట్టి చంపారు."

జర్మన్ నాజీపత్రిక ఈ విషయాన్ని ప్రకటించినప్పుడు ఇది కల్పితమైనదేమో అనే సందేహంగా కలిగినప్పుడు. కాని, యూదులు చేస్తున్న దారుణాల్ని గురించి [illegible] మిమ్మాని కథలెన్నో వున్నాయి. వారు శుక్రవారంనాడు మసీదుల ప్రాంతాలలో బాంబుల్ని వేస్తున్నారు. శుక్రవారం నాడు మహమ్మదీయులందరు నమాజుకోసం మసీదులలో చేర తారు. అంచేత ఆనాడు ఆ ప్రాంతాలలో బాంబుల్ని విసిరితే, చాలా ఎక్కువమంది హతులౌతారని వారి ఉద్దేశం. నిజంగా చాలామంది ఇదే ప్రకారం హతులౌతున్నారు కూడా. జెరూసలెం లోని ఒక పెద్దమసీదులో 1938 జూలై 15 వ తేది శుక్రవారం నాడు అరబ్బులు ప్రార్థనలు చేసుకొని వస్తూవుండగా, వారి మీద బాంబుపడింది. అందుమూలంగా ముగ్గురు మగవాళ్ళు, ఆరుగురు ఆడవాళ్ళు, ఒక బిడ్డ చనిపోయారు; ఇరవైమంది మగవాళ్ళు, పదిమంది ఆడవాళ్ళు గాయపడ్డారు. వీరిలో కొందరికి ప్రాణాపాయ కరమైన గాయాలు తగిలాయి. పగిలిన పుర్రెలతో, తెగిపడ్డ కాళ్ళచేతులతో, కాల్వలు కట్టిన నెత్తురుతో ఆ ప్రదేశం ఎంత భీభత్సంగా కనబడిందో చెప్పతరంగాదు!

ఈ ఒక్క శుక్రవారంనాడు మాత్రమేకాదు; వరసగా అనేక శుక్రవారాలనాడు మసీదులవద్ద ఇదేవిధంగా బాంబులు

పడ్డాయి; ఇంత ఎక్కువగానూ జననష్టం జరిగింది. ఇంతటి ఘోరాలు జరుగుతూవుంటే, వీటినిగురించి యూదుపత్రికలు చేసిన వ్యాఖ్య ఇది: "యూదులకు ఈ పాపాన్ని అంటగట్టి వారిమీద లోకానికి అసహ్యం కలిగించాలనే దురుద్దేశంతో అరబ్బులే ఈ విధంగా బాంబుల్ని విసరుతున్నారు." దీన్ని చూచినప్పుడు అరబ్బులగుండె ఇంకెంతగా మండుతుందో ఎవరికివారు ఊహించుకోవలసిందే!

యూదులు ఎంత విశృంఖలంగా ప్రవర్తించినా, ఏమి దౌర్జన్యాలను చేసినా, బ్రిటిష్‌అధికారులు చూచీచూడనట్లు ఊరుకుంటారు. తప్పనిసరివచ్చి శిక్ష వెయ్యవలసివచ్చినపక్షంలో, చాలా తేలికగా వదిలివేస్తారు. ఒకే నేరానికి అరబ్బుకు మరణశిక్ష, యూదీయునికి కొద్దిపాటి జైలుశిక్షపడిన ఉదాహరణలకు లెక్కలేదు.

షేక్ ఫరహాత్ సాదీ అనే అరబ్బు ముదుసలికి — వయస్సు 80 సంవత్సరాలు — అతడిఇంటిని సోదాచూడగా, గోడలో ఒకరివాల్వర్ కనబడిందనే నేరంకింద మరణశిక్ష వేశారు. 1938 జనవరి 12వ తేదీని యూదీయుడైన ఒకమహారాజవాను దగ్గర ఒక రివాల్వర్, నాలుగు కణికల డైనమైట్ దొరికింది. ఇందుకు అతడికి వేసినశిక్ష — అయిదేళ్ళ జైలు!

ఆల్ట్‌మన్ అనే యూదుపోలీసువాడు 1938 ఫిబ్రవరి 4వ తేదిని అరబ్ లారీమీద తుపాకినికాల్చినందుకు మిలిటరీకోర్టు అతడికి ఉరిశిక్ష వేసింది. ఫిబ్రవరి 7వ తేదిని ఈ ఉరిశిక్షను

ఆ జన్మకారాగారవాసానికి తగ్గించారు. [illegible] పది హేడు సంవత్సరాల అరబ్బు [illegible] పట్టుబడిందని పదిసంవత్సరాల శిక్ష విధించారు.

పాలస్తీనాలో బ్రిటిషుకోర్టులు పనిచేస్తున్న విధానం ఇదే! ఇంతకు మించిన ఒక ఘోరం ఏమిటంటే — యూదు పోలీసులకు తుపాకుల్ని ఇస్తున్నారు; అరబ్బు పోలీసులకు లాఠీ లనుమాత్రమే సప్లయి చేస్తున్నారు.

# 15

బ్రిటిష్ అధికారులు, వారిని బలపరుస్తున్న యూదు జాతీయులు ఎంత దౌర్జన్యానికి దిగినా అరబ్బు జాతీయ వాదులు చెదిరిపోవడం లేదు. తమ ప్రతికక్షులు ఎక్కువగా దౌష్ట్యాలను చేసినకొద్దీ, అరబ్బులు ఎక్కువగా ధైర్యసాహసాలను ప్రదర్శిస్తున్నారు. ఈ సారితో ఈ దేశం మనది కావడమో, కాకపోవడమో తేలిపోవాలి అనే పట్టుదలతో వారు ముందుకు పోతున్నారు.

"ఆధునిక యుద్ధానికి కావలసిన సాధనాలు బొత్తిగా లేని ఈ చిన్న తిరుగుబాటును బ్రిటిష్ ప్రభుత్వం వారు అణిచి వెయ్యలేరని అనుకోవడం హాస్యాస్పదం" అని పీల్ కమిషన్* తన నివేదికలో వ్రాసింది. ఈవాక్యాన్ని వ్రాసినతర్వాత సంవత్సరం పైగా గడచినా ఇప్పటికీ అరబ్బుల స్వాతంత్ర్య సమరం సాగు

---

* దీన్నిగురించిన వివరాలు పై ప్రకరణంలో.

[illegible] అరబ్బులకు ఆధునికమైన ఆయుధాలు లేకపోవచ్చును. కాని, వారి చేతులలో జాతీయత అనే వజ్రాయుధమున్నది. వారు చేస్తున్నది చిన్న తిరుగుబాటే కావచ్చును. కాని, బ్రిటిష వారి ప్రతిదౌర్జన్యంతోనూ ఆ తిరుగుబాటుకు కొత్తబలం వస్తున్నది.

అరబ్బువిప్లవకారులు చేసే సాహసకృత్యాలకు అంతులేదు; వారు ఎదుర్కొనే అపాయాలకు పారంలేదు.

వారికి కావలసిన డబ్బును వారు బ్రిటిష్ బ్యాంకుల నుంచి దోచుకుంటున్నారు; కావలసిన తుపాకుల్ని బ్రిటిష్ పోలీసు స్టేషన్లనుంచి ఎత్తుకుపోతున్నారు. ఎక్కడినుంచి ఎప్పుడు వచ్చిపడతారో తెలియదు. తిరిగి అంతలోనే ఎటు మాయమైపోతారో చెప్పలేము. కొన్నిచోట్ల పన్నుల్ని వసూలుచేసి, రసీదుల్ని ఇస్తున్నారు. మరికొన్నిచోట్ల కోర్టుల్ని పెట్టి, తీర్పుల్ని చెబుతున్నారు.

ఈ సందర్భాలలో వారు దౌర్జన్యాల్ని చేస్తున్నమాట నిజం. అయితే, వారి దౌర్జన్యాలు బ్రిటన్ దౌర్జన్యాలకు కేవలం బదులు. వారు న్యాయాన్ని కోరారు. న్యాయం లభించలేదు. అశాంతిని కనబరచారు. దమననీతి ప్రారంభమైంది. అందుచేత బహిరంగ విప్లవానికి తలపడ్డారు. విప్లవంలో దౌర్జన్యాలు తప్పవుగదా!

బ్రిటన్‌పైన విప్లవాన్ని చెయ్యడంలో ఫేసిస్టు ప్రభుత్వాలు అరబ్బులకు కొంతవరకు తోడ్పడుతున్నవి. ఇలా

తోడ్పడ్డంలో వాటిప్రదేశం అరబ్బుల స్వాతంత్ర్యానికి తోడ్పడ్డం కాదు; బ్రిటన్‌ను చిక్కుల్లో పెట్టడమే. [illegible] పాలస్తీనాను పరిపాలించడానికి వీలుచిక్కలేదే, [illegible] గాని ఆ అవకాశాన్ని పోనియ్యావు. అని బ్రిటన్ [illegible] ఎక్కువ నిరంకుశంగా పరిపాలన సాగిస్తూవుండేది. అయితే, ఇది బ్రిటన్ శాశ్వతంగా పాలస్తీనాను స్వాధీనంలో ఉంచడానికి "ఆర్గుమెంట్" కాదు; కాకూడదు. ఈ ఉద్యమం [illegible] ఇంపీరియలిజం ఎంత దుష్టమైనదో, [illegible] మైనదని చెప్పడానికే!

ప్రస్తుతం జరుగుతున్న విప్లవ ప్రారంభంలో ముసోలినీ అరబ్బులకు పూర్తిగా సహాయంచేశాడు. [illegible] ఆయుధాల్ని పంపించాడు. విప్లవప్రచారాన్ని [illegible] బ్రిటన్‌ను మయ్యబట్టడానికీ, పాలస్తీనా అరబ్బుల [illegible] మహమ్మదీయప్రపంచాన్ని అంతటినీ [illegible] పురికొల్పడానికి బారీ దీవులలో ప్రత్యేకంగా ఒక రేడియో స్టేషన్ కట్టించి, ప్రాచ్యభాషలలో బ్రాడ్‌కాస్టు చేయించాడు. "ఇస్లాం సంరక్షకుడు" అని తనకు తానే ఒక బిరుదును తగిలించుకున్నాడు.

ప్రారంభంలో ఇంతచేసిన ముసోలినీ ఆంగ్లో - ఇటాలియన్ ఒడంబడిక తర్వాత, సర్దుకున్నాడు. అప్పటినుంచి హిట్లర్ అందుకున్నాడు. అతడు అరబ్బులకు ఎంతగా సహాయం చేస్తున్నదీ ఈ కింది కథవల్ల తెలుస్తుంది:

అరబ్బు విప్లవకారులు రోడ్లమధ్య తుపాకిమందు గనిని పెడుతున్నారు. రోడ్డు పైకి మామూలుగానే వున్నది గదా అని ఏ మిలిటరీ లారీయో దానిమీదగా వెడితే, ఆగని పేలుతుంది; లారీలోని వారు దెబ్బతింటారు. ఇలాంటి అపాయాలు ఎక్కువ కావడాన్ని చూచి, బ్రిటిష్ అధికారులు ఒక ఎత్తు వేశారు. అది ఏమంటే,— ఒక లారీలో తమ బందీలో వున్న అరబ్బు విప్లవకారుల్ని కూర్చోపెట్టడం; దాన్ని రోడ్డుమీద ముందు నడిపించి, తమ లారీలను వెనక వుంచడం. ఇందువల్ల రోడ్డుమధ్య గని వుండి పేలితే, అది విద్రోహులు వున్నట్టి ముందు నడిచే లారీ కిందనే పేలాలి. అప్పుడు తమ వారిని తమ చేతులతోనే చంపుకున్నట్లు అవుతుంది గదా అని విప్లవకారులు గనుల్ని పెట్టడం మానివేస్తారు. కొన్ని రోజులపాటు ఈ ఎత్తు బాగానే పారింది. ఆ తర్వాత మొదటి లారీ కిందనే కాకుండా ఏ లారీ కింద కావాలంటే, దాని కిందనే పేలేగనుల్ని అరబ్బులు పెట్ట నారంభించారు. గనుల్ని పెట్టడంలో వారు చూపిన ఈ కొత్త ప్రజ్ఞకు జర్మన్ ఇంజనీయర్లు కారణం అని అంటున్నారు. ఇది నిజమే కావచ్చును.

ఇటలీ, జర్మనీలు తమకు సహాయాన్ని చేసినవి గదా అని అరబ్బులు ఫేసిజంవైపుకు మొగ్గితేమాత్రం వికాసంకోసం — విజృంభణకోసం — పెనుగులాడుతున్న వారి జాతీయత పుట్టుకలోనే సంధి కొట్టిపోతుంది. ఉన్నతాశయాలతో బయల్దేరి, చివరికి బ్రిటిష్ ఇంపీరియలిస్టుల తాబేదారులై పోయిన జియోనిస్టుల వలె వారుకూడా గర్హ్యనీయులౌతారు.

# 16

మొదట కొంతకాలం దమన నీతిని ప్రయోగించి, దానివల్ల విప్లవం తగ్గనందున, ఇంకొకదానిని తొక్కడానికే తలంపుతో బ్రిటన్ 1936 జులైలో పాలస్తీనా సమస్యా పరిష్కారానికి తగిన సూచనలన్నీ చెయ్యడానికి అంటూ, పీల్ ప్రభువు అధ్యక్షతక్రింద, ఒక రాయల్ కమీషన్‌ను నియమించింది. పరిస్థితులు శృతిమించినప్పుడు బ్రిటన్ ఇలాంటి తతంగాన్ని నడపడం పరిపాటి. కమిషన్ అనిగాని, కమిటీ అనిగాని, కాన్ఫరెన్సు అనిగాని ఒకదాన్ని సృష్టిస్తే, అది చివరికి చెయ్యగల పని శూన్యమైనప్పటికీ, ఈ లోపుగా ప్రజాందోళనను కొంత వరకు అరికట్టి వుంచవచ్చును. అయితే, ఈ ఎత్తు అరబ్బులకు తెలియనిది కాదు. ఇంతకు పూర్వం ఆరుసార్లు ఈ కమిషన్ల తతంగం జరిగింది. అందుచేత వారు పీల్ కమిషన్‌ను పూర్తిగా బహిష్కరించారు.

అయినప్పటికీ పీల్ కమిషన్ వారు పాలస్తీనా వచ్చి, కొన్ని నెలలపాటు అక్కడ పర్యటనం చేసి, తిరిగి ఇంటికి చేరుకొని, 1937 జులైలో తమ నివేదికను ప్రకటించారు. ఈ నివేదికలో వారు సమస్యాపరిష్కారానికి సూచించిన మార్గం, — పాలస్తీనాను మూడు ముక్కలుగా పంచి, ఒకముక్కను అరబ్బులకూ, ఒక ముక్కను యూదులకూ ఇవ్వడం, మూడోదాన్ని బ్రిటన్ వుంచుకోవడం.

అసలు పాలస్తీనాను మూడు భాగాలకింద విభజించాలనడం అన్యాయమైతే, ఇక ఆ మూడుభాగాల పరిమితి విషయంలో పాలెస్తీనాకమిషను వారు చేసిన సూచనలు కేవలం ఘోరమైనవిగా వున్నాయి.

అన్ని పుణ్యక్షేత్రాలు, జాఫామీద పూర్తిఅధికారం, పాలెస్తీనాలో ప్రధానమైన అన్ని ప్రదేశాలు, — ఇది బ్రిటను వాటా.

అన్ని పంటలు పండే సారవంతమైన పీఠభూమి, అన్ని రహదార్లు, అన్ని వాణిజ్యసౌకర్యాలు, — ఇది యూదులవాటా.

మిగతా ఎడారి అంతా దానధర్మవిక్రియాది సర్వ హక్కులతో, — అరబ్బులవాటా.

పాలస్తీనా'లోవున్న పుణ్యక్షేత్రాలు ఒక్క పాలస్తీనా వాసులకే కాక ప్రపంచం అంతటికీ సంబంధించినవి. అంచేత అవి బ్రిటన్ పరిపాలనలో వుండడం ధర్మం. బ్రిటిష్ సామ్రాజ్య రక్షణకు జాఫా అవసరం. అంచేత దానిమీద బ్రిటన్‌కు హక్కు వుండవలసిందే !

“మని ఎక్కడా కూడా మాకు కాలూనడానికి వీలులేకుండా పోతూవుండడంవల్ల, భూమిఅంటే మాకు ప్రేమపర్పడింది. ఇకముందు వ్యవసాయమే వృత్తిగా మేముపెట్టుకోదలచుకున్నాము” అని యూదులు అంటున్నారు. అంచేత వారికి ఎంత మేరకు వీలైతే అంతవరకు సారవంతమైనభూమిని కట్టబెట్ట

# 17

ప్రస్తుతం పాలస్తీనాలో బ్రిటిష్ ఇంపీరియలిజంకూ, అరబ్బు జాతీయతకూ జరుగుతున్న సంఘర్షణ కారణంగా 1938 అంతానికి దాదాపు మూడు వేలమంది అరబ్బులు హతులైనారు; గాయపడిన వారి సంఖ్యకూడ ఇంతో, ఇంతకుమించో వుంటుందిగాని, తక్కువ మాత్రం కాదు. ఇక అరెస్టులకు అంతులేదు. అరబ్ జాతీయ నాయకులలో ప్రముఖులందరు చెరసాలలలోనో, ప్రవాసంలోనో వున్నారు. ఎన్నో గ్రామాలు నేలమట్టమై పోయినాయి. స్థిరచరాస్తులకు కలిగిననష్టం ఇంతింత కాదు. సోదాలు, జప్తులు, దోపుడులు నిత్యకృత్యాలు.

బ్రిటన్ అవలంబించిన దమన నీతివల్ల కలిగిన ఈ భయంకర ఫలితాన్ని చూచి, సభ్యతాప్రపంచం అసహ్యించు తుంది. ఇక, మహమ్మదీయ సంఘంలో — ముఖ్యంగా వివిధ దేశాలలో వున్న అరబ్బులలో* — కలిగిన కలవరం ఇంతింత కాదు. యూదీయుల పక్షాన్ని చేరి బ్రిటన్ తమ మతస్థుల్ని క్రూరంగా హింసిస్తున్నదని మహమ్మదీయులందరు ఆవేశాన్ని పొందారు. అరబ్బురాజ్యాలమధ్య — వాటి గుండెలో పొడవ డానికి — బ్రిటిష్ ఇంపీరియలిస్టులు యూదురాజ్యాన్ని స్థాపించ డానికి యత్నిస్తున్నారని అరబ్బులందరు సంక్షోభపడ్డారు.

---

*ప్రపంచం మొత్తంమీద 25 కోట్లమంది మహమ్మదీయులున్నారు. వీరిలో అరబ్బులు నాలుగు కోట్లమంది.

అరేబియా పీఠభూమిలోనే కాకుండా, సిరియాలోను, ఉత్తర ఆఫ్రికాలోను, హిందూమహాసముద్రతీరాలలోను అరబిక్ భాషను మాట్లాడేవారు దాదాపు నాలుగు కోట్లమంది వున్నారు. వారున్నట్టి దేశాలు ఇవి: ఈజిప్టు, సిరియా, లెబనాన్, ఇరాక్, యెమెన్, పాలస్తీనా, ట్రాన్స్‌జోర్డాన్, సౌదీ అరేబియా, ఓమన్, లిబియా, టునీషియా, అల్జీరియా, ఫ్రెంచి మొరాకో, స్పానిష్ మొరాకో, ఇంకా మరికొన్ని చిన్నచిన్న రాష్ట్రాలు. వీటిలో ఈజిప్టు, ఇరాక్, సౌదీ అరేబియా, యెమెన్* స్వతంత్ర రాజ్యాలు. సిరియా, లెబనాన్ రాజ్యాలు — ఇంకా ఫ్రెంచివారి మేండేటరీ అధికారంలోనుంచి పూర్తిగా తప్పించుకోవలసియున్నా — ప్రజాస్వామికాలు. పాలస్తీనా, ట్రాన్స్‌జోర్డాన్ రాజ్యాలు బ్రిటిష్ మేండేట్ కింద వున్నాయి. లిబియా, ఇటలీ పరిపాలనకింద వుంది. టునీషియా, అల్జీరియారాజ్యాలు ఫ్రెంచివారి ఏలుబడిలోవున్నాయి. ఇలా వివిధరూపాల ప్రభుత్వంకింద — విదేశప్రభుత్వాల పరిపాలనకింద — వున్న అరబ్ జాతివారినందరిని ఐక్యపరచి, ఒక అరబ్ మహారాజ్యాన్ని స్థాపించాలనే ఒక ఉద్యమం తలయెత్తింది. ఈ ఉద్యమానికి సిరియా జన్మస్థానం. అక్కడినుంచి ఇది తక్కిన అరబ్ రాజ్యాలకు పాకింది.

ఈజిప్టు ప్రజలు అరబిక్ భాషనే మాట్లాడతారు. అయితే వారికీ, తక్కిన అరబ్బులకూ రక్తసంబంధం — జాతి సంబంధం — తక్కువ. అయినప్పటికీ సిరియా తర్వాత ఈజిప్టు

* హెడ్జాజ్‌కు దక్షిణంగావుంది.



బ్రిటిష్ సోల్జర్లు ఒకగ్రామాన్ని
భస్మీపటలంచేస్తున్న భయానకదృశ్యం

*Courtesy "Deccan Times".*

ఇటీవలి ఆరబ్ జాతీయ సంఘటనోద్యమానికి ప్రధాన కేంద్ర మైంది. వారం, పదిరోజుల ఈ మధ్య — 1938 జనవరి మధ్య భాగంలో — జరిగిన విషయాల్ని బట్టి చూస్తే, ఈ జిప్టు రాజు ఫరూక్ ఈ మహోద్యమానికి నాయకు డయ్యేలా వున్నాడు.

అరబ్ జాతిప్రజలనందరినీ ఐక్యపరిచి, ఒక ఆరబ్ మహా రాజ్యాన్ని సృష్టించాలని ఈవిధంగా ఒకఉద్యమం తలయెత్తుతూ వున్న సమయంలోనే బ్రిటిష్‌వారు పాలస్తీనాలోని ప్రధాన భాగాన్ని విడదీసి, అక్కడ ఒక యూదురాజ్యాన్ని నిర్మించా లనే ప్రయత్నం (పీల్ కమిషన్ ద్వారా) చేశారు. ఈ ప్రయ త్నాన్ని ఒక్క పాలస్తీనాఅరబ్బులే కాకుండా, అరబ్బుజాతి వారందరూ తీవ్రంగా ప్రతిఘటించారు. దీన్ని చూడగా ఇస్లాం ప్రపంచం అంతాకూడా తమకుప్రతికూలం అయిపోతుందేమో నని బ్రిటిష్‌వారికి భయంతోచింది. అరబ్బులకు ఇటలీ, జర్మనీ రాజ్యాల తోడ్పాటుకూడా వున్నదనే బెదురుపుట్టింది. అంచేత వారు పాలస్తీనావిభజన ప్రయత్నాన్ని విరమించారు.

విరమించి, పాలస్తీనాసమస్యా పరిష్కారానికి లండన్‌లో ఒక రౌండ్ టేబుల్ సభను జరప నిశ్చయించారు. దీనికి వివిధరాజ్యాల అరబ్బు ప్రతినిధుల్ని ఆహ్వానించారు.

ఈ విధంగా వివిధరాజ్యాల అరబ్బు ప్రతినిధుల సహా కారాన్ని కోరడం ప్రశంసాపాత్రంగానే వుందిగాని, పాల స్తీనాజాతీయోద్యమానికి ప్రధాననాయకుడైన గ్రాండ్

ముఫ్తీని * ఆహ్వానించకపోవడంలో స్పష్టపరచారు కూడా. ఇంతే కాదు. రాజకీయఖైదీల సంఖ్యని విమానాల [illegible] లోనూ, దమననీతిని విరమించక పోవడంలోనూ, గ్రాండ్ ముఫ్తీ నాయకత్వంకిందవున్న అరబ్ హైయర్ కమిటీకి [illegible] పాలస్తీనా డిఫెన్స్ పార్టీని లేవదీయించడంలోనూ ఇంకా అనేక పొరపాట్లను చేశారు.

పాలస్తీనాసమస్యను నిజంగా పరిష్కరించదలిస్తే, బ్రిటిష్‌వారు ఈ పొరపాట్లను చెయ్యవలసింది కాదు. పాలస్తీనా అరబ్బులు తమ కోర్కెల్ని ఇదివరకే స్పష్టపరిచారు. అవి ఇవి:

పాలస్తీనాను యూదుజాతీయకేంద్రంగా చెయ్యాలనే ప్రయత్నాన్ని విరమించుకుని, బాల్ఫర్ ప్రకటనను రద్దుపరచాలి.

ఇకముందు యూదులను పాలస్తీనాకు వలసకు రానివ్వరాదు.

(బ్రిటిష్ మాండేటును రద్దుపరచి, ఇరాక్‌తో చేసుకున్నట్టుగా ఒక సంధిచేసుకుని, పాలస్తీనాను స్వతంత్రమైన అరబ్బు రాజ్యంగా చేయాలి.

ఈ కోర్కెల్ని బ్రిటన్ అంగీకరించకపోతే, లండనులో మరికొద్దిరోజులలోనే సమావేశంకానున్న పాలస్తీనా రౌండ్ టేబుల్ సభ విఫలం కాక తప్పదు. ఈజిప్టు, ఇరాక్ రాజ్యాల

---

* ఈయన ప్రస్తుతం సిరియాలో ప్రవాసిగా వున్నాడు.

ప్రధాన మంత్రిలు ఈ సభ జయప్రదం కాగల దనే విశ్వాసాన్ని ప్రకటిస్తున్నారు. ఈ లండన్ రౌండ్ టేబుల్ సభల అనుభవం పూర్తిగావున్న భారతీయులు ఈ ప్రకటనలోని ఆశలో భాగస్వాములు కాలేరు.

ఈ సందర్భంలో యూదుజాతివారు ఒక విషయాన్ని గమనించడం వారికే శ్రేయస్కరం. వారిని ఫేసిస్టు డిక్టేటర్లు పెడుతున్న ఘోరహింసలు ప్రపంచ హృదయాన్ని ద్రవీభూతం చేస్తున్నాయి. ఎక్కడనూ నిలవ నీడలేక అల్లాడుతూవున్న వారి స్థితి నిజంగా దీనాతి దీనమైనదే! అయితే, ఆ కారణంచేత, వారు పాలస్తీనా అరబ్బులకు అన్యాయం చెయ్యడంగాని, పాలస్తీనాను యూదురాజ్యంగా మార్చడంగాని సహించరాని పని. పూర్వకాలంలో పాలస్తీనా యూదుజాతీయ కేంద్రం అయినమాట నిజం. కాని, దాదాపు రెండువేల సంవత్సరాల నుంచి అరబ్బులు అక్కడ స్థిరనివాసం ఏర్పరచుకుని వున్నారు. తమకు యూరపియన్ జాతులవారు అన్యాయం చేస్తున్నారు గదా అని, యూదుజాతివారు అరబ్బులను దేశభ్రష్టుల్ని చెయ్యడం న్యాయమా?

హీబ్రూ యూనివర్సిటీ ప్రధానాధికారి అయిన జూడా మాగ్నెస్ "అరబ్బుల సమ్మతిలేకపోతే పాలస్తీనాలో ప్రస్తుతమున్న నాలుగులక్షల యూదీయులకు — తాత్కాలికంగా బ్రిటిష్ సైన్యాల రక్షణవున్నా— ప్రాణాపాయం తప్పదు" అని హెచ్చరించాడు. ఈ సంగతిని తక్కిన యూదీయ ప్రముఖులుకూడ ఎంత త్వరగా గ్రహిస్తే, వారికి అంతలాభం.

ఇటు అరబ్బులకూ, అటు యూదులకూ, వారుభయులమధ్య వున్న బ్రిటిష్‌వారికీ ఎక్కడా లంగరు అందడంలేదు.

పాలస్తీనా అరబ్బుల స్వాతంత్ర్యోద్యమాన్ని అరికట్టడం అసాధ్యమని గ్రహించడంవల్లనేమి, పాలస్తీనా అరబ్బులతో రాజీపడకపోతే, చుట్టుప్రక్కలవున్న అరబ్బు రాజ్యాలతోనే కాకుండా పూర్తిమహమ్మదీయ ప్రపంచంతోనే విరోధం తెచ్చిపెట్టుకోనక తప్పదనే భయంవల్లనేమి, ప్రస్తుతపు అంతర్జాతీయ విషమపరిస్థితులవల్లనేమి, బ్రిటిష్‌వారు ఎల్లాగైనా సరే రాజీపడాలని చూస్తున్నారు. అయితే, పాలస్తీనాను చెయ్యిజారిపోనివ్వడం వారికి సుతరామూ ఇష్టంలేదు. అంచేత, పైకి స్వాతంత్ర్యాన్ని ఇచ్చినట్టు కనబడుతూ, నిజమైన రాజ్యాధికారాన్ని తమ గుప్పిటిలో పెట్టుకోవాలని వారు ఎత్తులు వేస్తున్నారు.

మనదేశం విషయంలో సైమన్ కమిషన్, లండన్ రౌండ్ టేబుల్ సమావేశాలు, జాయింటు పార్లమెంటరీకమిటీ— ఈ తతంగాన్ని అంతా జరిపి చివరికి స్వల్పమైన విషయాలలో ఏకొంత స్వాతంత్ర్యాన్ని యిస్తూ, ముఖ్యమైన విషయాలలో పూర్వం కంటెకూడ అధికంగా పర పరిపాలనను విధించే ఇండియా యాక్టును తయారుచేసినట్టే పాలస్తీనావిషయంలో కూడా నాటకాన్ని ఆడాలని బ్రిటిష్‌వారు ప్రయత్నిస్తున్నారు.

“భారతీయులకు స్వపరిపాలనాధికారాన్ని యివ్వడమే మాఅంతిమ (Ultimate) ఆదర్శం”, అని బ్రిటిష్‌వారు ఇంతకు



యూదులూ, అరబ్బులూ కొట్లాడుతూ ఉంటే బ్రిటిషువారు
పాలస్తీనాను (ఒంటెను) కాజేస్తున్నారు.

— By Courtesy of "Deccan Times"

ఘాటుగాను ప్రకటించారు. అదేవిధంగా ఇప్పుడు వారు "పాలస్తీనాను చివరికి (Ultimately) స్వతంత్రరాజ్యంగా చెయ్యాలని మా ఆశయము" అని అంటున్నారు. "చివరికి" అంటే ఎప్పటికి? శతాబ్దం చివరికా? లేక, సహస్రాబ్దం చివరికా?

ఉన్నతమైన ఈ ఆశయాన్ని, దృష్టిలో పెట్టుకుని, ప్రస్తుతానికి ఈక్రింది ఏర్పాట్లను చేస్తారట.

పాలస్తీనాను యూదుజాతీయకేంద్రాన్ని చేయడమనే ప్రయత్నాన్ని నిరసించడం.

అందరు పౌరులకు సమానహక్కుల్ని ఇవ్వడం.

యూదుమైనారిటీసంఘ క్షేమానికి తగిన రక్షణాల్ని ఏర్పాటు చెయ్యడం.

దేశ రక్షణ విషయమై సంధిని చేసుకోవడం.

అరబ్బు, యూదు, బ్రిటిష్ సభ్యులతో శాసనసభను ఏర్పాటు చెయ్యడం.

అరబ్బులనూ, యూదులనూ, వీలునుబట్టి ఆలోచించడానికి మళ్ళీ కొంతకాలానికి ఇంకొక సమావేశాన్ని లండన్‌లోనే జరుపుతామని బ్రిటిష్‌వారు అన్నారు. ఇంకొక దేశపరిపాలనలో భాగస్వాముల్ని చెయ్యడం.

ఈ ఏర్పాట్లకు ముందుఒప్పుదలయైతే, వీటికి సంబంధించిన వివరాల్ని గురించి నిర్ణయాల్ని చెయ్యడానికి తిరిగి ఇంకొక సమావేశాన్ని జరుపుతామని అన్నారు.

# 19

ఇందుకు సమావేశాన్ని పైసారికి వాయిదా వెయ్యడం అనవసరమనీ, ఆ వివరాల సంగతికూడా ప్రస్తుతమే బయలు పెట్టవలసిందనీ అరబ్బులు పట్టుపట్టగా, వాటిని కూడా తెలియ చేశారు. అవి ఏమంటే,—

దేశాన్ని రెండు మూడు ఖండాలుగా విభజించడం,

ఒక్కొక్క ఖండానికి ఒక ఎసెంబ్లీని, ఒక కౌన్సిల్‌నూ, (మన మద్రాసు రాజధానిలో రెండు శాసనసభలున్నట్టుగా) ఏర్పాటు చెయ్యడం,

రెండింటికీకూడా అరబ్బు, యూదు, ప్రతినిధుల్ని మొత్తం జనాభాలో వారి వారి జాతుల దామాషా ప్రకారం ఎన్నుకోవడం.

మెజారిటీ ఓట్లనుబట్టి అసెంబ్లీలో నిర్ణయాల్ని చెయ్యడం.

ఇక, కౌన్సిల్‌లో మెజారిటీ, మైనారిటీలతో నిమిత్తం లేకుండా అరబ్బులు, యూదులు విడివిడిగా ప్రతితీర్మానం మీద విడివిడిగా ఓటు చెయ్యడం.

ఆర్థిక వ్యవహారాలు, వలససమస్య, భూముల క్రయ విక్రయాలు మొదలైన ముఖ్యవిషయాల్ని గురించి ముందుగా తీర్మానించగల అధికారం కౌన్సిల్‌దేగాని, అసెంబ్లీది కాదు.

ఆరబ్బులకు, యూదులకు ఏకాభిప్రాయం కుదరక, ప్రతిష్టంభన ఏర్పడ్డప్పుడు వీటో చెయ్యగల అధికారం హైకమిషనర్‌కు వుండడం.

యూదులు, ఆరబ్బులు ప్రస్తుత వైషమ్యాలను చంపుకుని, ఒకరితో ఒకరు సహకారం చెయ్యడం ప్రారంభించగానే హైకమిషనర్ వీటో అధికారం రద్దు కావడం.

స్వపరిపాలనకూ, స్వాతంత్ర్యానికీ అవకాశ మివ్వని ఈ ఏర్పాట్లకు ఆరబ్బు ప్రతినిధులు అంగీకరించడం లేదు. ఇందుకు బదులుగా పాలస్తీనాకు యూదీయుల వలస పూర్తిగా ఆగి పోవాలనీ, ఇకముందు ఆరబ్బుల భూముల్ని యూదీయులు క్రియం చేయించుకోడానికి వీలుండరాదనీ వారు కోరుతున్నారు. ప్రజలందరు చేరి ఒక కాన్సిట్యూయెంట్ అసెంబ్లీని ఎన్నుకోవాలనీ, ఈ అసెంబ్లీసభ్యులు తమలో కొందరిని మంత్రులుగా నియమించాలనీ, ఈ మంత్రులకు వెంటనే దేశపరిపాలనాధికారాన్ని ఇచ్చివెయ్యాలనీ, ఇప్పుడు వివిధశాఖలకు అధికారులుగా వున్నవారు ఈ కొత్త మంత్రులకు లోబడి వుండాలనీ వారు (ఆరబ్బు ప్రతినిధులు) పట్టు పడుతున్నారు. ప్రజలు ఎన్నుకున్న కాన్సిట్యూయెంట్ అసెంబ్లీయే పాలస్తీనాకు భావి రాజ్యాంగ విధానాన్ని నిర్ణయించాలనీ, ఈ విధానాన్ని ఎట్టి మార్పులులేకుండా బ్రిటిష్‌పార్లమెంట్ ఆమోదించాలనీ కూడా వారివాదం. ఈ షరతులకు అంగీకరించని పక్షంలో

ఇంకొక సమావేశాన్ని జరపడం వృథా శ్రమ అని వారు ఖచ్చితంగా చెబుతున్నారు.

ఇక, యూదు ప్రతినిధులకు అరబ్బుల షరతులు ఎంతో కంటకంగావున్నవో బ్రిటన్ సూచనలు కూడా అంతే అసంగీకారంగా వున్నాయి. వారు పై వృథ యత్నాలకు భిన్నంగా వేరే, తమ షరతుల్ని తాము పెడుతున్నారు. బ్రిటన్ పాలస్తీనాపై తన మేండేటరీ అధికారాన్ని వదులుకోరాదనీ, ఆ దేశాన్ని రెండుగా చీలదీసి, ఒక రాజ్యాన్ని అరబ్బు రాజ్యంగానూ, ఇంకొకదాన్ని యూదు రాజ్యంగానూ చేసి, కొంతకాలందాకా అక్కడి ప్రజల సహకారంతో పరిపాలిస్తూ, చివరికి ఒకనాటికి రెండు భాగాలలోనూ సమానమైన జనాభా వుండేటట్లుగా చెయ్యవలసిందిగా వారు కోరుతున్నారు.

ఈ ధోరణిలో నడుస్తున్నది లండన్‌లో జరుగుతున్న పాలస్తీనా సమావేశం. రాజీకుదర లేదనీ, మరి సాధ్యం లేదనీ, సమావేశం చాలించబడిందనీ, రేపో మాపో వార్తవస్తే మనం కించిత్తు అయినా ఆశ్చర్యపడ నవసరం లేదు.

పాలస్తీనాసమస్య ఎన్నటికైనా పరిష్కారమైతే, పాలస్తీనాలోనే కావాలిగాని లండన్‌లో కాదు.

